# బుద్ధ భగవానుడు

## (జీవిత చరిత్ర)

రచన

శ్రీ దంటు కృష్ణమూర్తి

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,

గ్రంథప్రకాశకులు (స్థా. 1882) రాజమహేంద్రవరము.

## విన్నపం

అవతార పురుషులలో ఒకడుగా ప్రజాకోటిచే ఆరాధించబడే బుద్ధుని జీవిత విశేషాలు సంగ్రహంగా పాఠక లోకానికి అందచేయాలన్న సంకల్పంతో యీ పుస్తకం వ్రాశాను. బుద్ధుని చరిత్రతో బాటు ఆయన బోధనలూ, బౌద్ధమత వ్యాప్తి జరిగినరీతులు కూడా యిందు ఉదహరించబడ్డాయి.

పాఠకలోకం యింతవరకూ నా రచనలన్నిటి పైనా చూపిన ఆదరాభిమానాలను దీనిపై కూడా వ్యక్తపరుస్తుందని విశ్వసిస్తున్నాను.

దంటు కృష్ణమూర్తి.

# బుద్ధుడు

దశాబ్దంనాటి మాట కాదు.
శతాబ్దంనాటి సంగతికూడా కాదు.

ఇరవై అయిదు శతాబ్దాలనాటి విషయం.

'అహింస' అన్నపదం బహుశా అప్పటికింకా పుట్ట లేదేమో! ఒకవేళ పుట్టినా వాడుకలోమాత్రం లేదనడం నిర్వివాదం.

అటువంటి సమయంలో హింసకుబదులు అహింసనూ, కర్కశత్వానికిబదులు కారుణ్యాన్నీ ప్రపంచంలో ప్రవేశపెట్ట డానికై అవతరించాడొక యుగపురుషుడు.

రాజ దంపతులకు కుమారుడుగా పుట్టిన ఆ మహా నీయుడు విశ్వమానవ కల్యాణంకోసమై సమస్త భోగాలనూ పరిత్యజించి ఆరు సంవత్సరాలపాటు అడవులలో అలమ టించాడు. ఆఖరుకు ఆ పుణ్యమూర్తి తపస్సు ఫలించింది. ప్రపంచాన్ని ఆవరించుకున్న కటిక చీకట్లను చీల్చగల మహాత్తర ఆయుధం ఆయనవశమైంది. దానితో ఆ ప్రతిభాసంపన్నుడు విశాల విశ్వానికి ఒక వినూత్న సందేశాన్ని అందచేశాడు. ఆ సందేశంలో వెల్లివిరిసినవి 'శాంతి-అహింసలే.'

ఇంతకూ ఎవరా కారుణ్యమూర్తి ?

ఆయనే ప్రపంచ ప్రఖ్యాతినందిన మన బుద్ధుడు.

రెండువేల అయిదువందల సంవత్సరాలక్రితం ఆయన పెట్టిన శాంతి - అహింసల భిక్షయే మనతరంలో పూజ్య బాపూజీకి ఆధారమై, భారతజాతి కొన్నిశతాబ్దాలుగా అనుభవిస్తూ వచ్చిన బానిసత్వాన్ని యుద్ధప్రసక్తి లేకుండా పారద్రోలడానికి మూలకారణమైంది.

ఇటువంటి విశిష్ట పురుషుడు కనకనే బుద్ధుడు నేటికీ భారతీయులచేత భగవదవతారాలలో ఒక అవతారంగా భావించబడి ఆరాధించబడుతున్నాడు.

అదేమి చిత్రమోగాని ఆ శాంతిమాత పేరంటే ప్రపంచమంతా పొంగిపోతుంది. ఇది భారతమాత అదృష్టం.

## జననం-మాతృవియోగం

హిమాలయ పర్వత పరంపరలకు
దక్షిణానగల రోహిణీ నదీతీరాన

కపిలవస్తు మహానగరం వుండేది. ఇరవై అయిదు వందల సంవత్సరాలక్రితం ఆ మహానగరాన్ని శుద్ధోదనుడు పరిపాలించేవాడు. ఆయనకు మాయాదేవి, మహాప్రజావతి అనే యిద్దరు భార్యలుండేవారు. శుద్ధోదనుడు అన్నివిధాలా ఆదర్శప్రాయుడైన రాజు. ఆయన పరిపాలనక్రింద ప్రజలు యేకొరతలూ లేకుండా స్వేచ్ఛగా జీవించేవారు. ధర్మదేవత నాలుగు పాదాలా

నడిచేది. శుద్ధోదనుని పట్టపురాణి అయిన మాయాదేవి కూడా సుగుణరాశి. తమ దేశం శాంతి, సౌభాగ్యాలతో తులతూగుతూ వుండడంవల్లనూ, ప్రజలందరూ తమపట్ల భక్తి విశ్వాసాలు కలిగి వున్నందువల్లనూ, రాజదంపతులు సుఖంగా కాలాన్ని వెళ్లబుచ్చేవారు. ఇలా చాలా సంవత్సరాలు గడిచి పోయాయి. అయితే వయస్సు ముదిరినకొద్దీ వార్ని ఒకేఒక ప్రబలమైన కోరిక వేధించసాగింది. అది సంతానవాంఛ. ఎలాగైనా తమవంశాన్ని నిలబెట్టగల ఒక పుత్రుని పొందాలన్న ఆవేదనతో వారు శాస్త్రోక్తంగా ఎన్నో యాగాలు చేశారు. ఎందరో దేవుళ్ళకు మొక్కారు.

ఇలావున్న సమయంలో ఒకనాటి అర్ధరాత్రి మాయాదేవికొక చిత్రమైన స్వప్నం కలిగింది. ఆమె నిద్రిస్తూవుండగానే కొందరు దేవదూతికలు వచ్చి పుష్పకంలో తీసుకువెళ్లి పవిత్రమైన గంగాజలంలో స్నానంచేయించి రకరకాల వేషభూషణాదులతో అలంకరించారు. తర్వాత ఒక మనోహరమైన శయ్యను అమర్చి దానిపై ఆమెను పరుండబెట్టారు. అప్పుడు విశాలకాయుడైన ఒక శ్వేతహస్తి ఘీంకరిస్తూ మూడు సార్లు ప్రదక్షిణంచేసి, ఆమె దక్షిణ పార్శ్వాన్ని ఛేదించి గర్భంలో ప్రవేశించాడు. ఇంతలో మాయాదేవికి నిద్రాభంగమైంది. ఆమె వెంటనే తనభర్తను లేపి స్వప్న వృత్తాంతాన్ని తెలియచేసింది. వెంటనే శుద్ధోదనుడు దైవజ్ఞులను పిలిపించి తనభార్యకు కలిగిన స్వప్నాన్నిగురించి తెలియచేసి దానిఫలితం

చెప్పమని కోరాడు. దానికి వారు రాజుతో "ప్రభూ! ఇది శుభప్రదమైన స్వప్నం. సకల కళా విశారదుడూ, సౌమ్యుడూ, సత్యతపస్వీ, ధర్మసాధకుడూ, మహానుభావుడూ మీకు పుత్రుడుగా జన్మించగలడు. అతడు సన్యాసాశ్రమాన్ని స్వీకరిస్తే జగద్గురువు కాగలడు" అన్నారు. ఈ శుభవార్త వినగానే రాజదంపతులు పరమానంద భరితులయ్యారు. దైవజ్ఞులు చెప్పినట్లే ఆమె గర్భవతి అయింది. క్రమంగా నవ మాసాలూనిండి ప్రసవసమయ మాసన్నమైంది. అపుడు తన తండ్రిగారి గృహానికి వెళ్లాలని మాయాదేవి కొక కోరిక కలిగింది. వెంటనే రాజు ఆమె ప్రయాణానికి అవసరమైన ఏర్పాట్లన్నీ జరిపించాడు. పెక్కుమంది చెలికత్తెలూ, పరిచారికలూ వెంటరాగా తన ప్రియసోదరి అయిన మహాప్రజావతితో సహా మాయాదేవి రథంపై పితృగృహానికి బయలుదేరింది. దారిలో ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ క్రమంగా వారు లుంబినీవనం జేరుకున్నారు. అక్కడ వారు విశ్రాంతి తీసుకొనడానికి అన్నిఏర్పాట్లూ చేయబడ్డాయి. మాయాదేవి, ప్రజావతులిద్దరూ అక్కడ విశ్రాంతి తీసుకుంటూ వనంలోని విశేషాలను పరికిస్తుండగానే మాయకు పురుటినొప్పులు ప్రారంభమయ్యాయి. కొద్దిసేపటికామె చక్కని బాలుని కన్నది. నిమిషాలలో యీ శుభవార్త అంతటా వ్యాపించిపోయింది. శుద్ధోదనుడు లుంబినీ వనానికి వెళ్లి కుమారుని చూసి పొంగిపోయాడు. మాయాదేవి పుత్రసమేతంగా రాజధానికి వచ్చేసమయానికి నగరమంతా కన్నులపండువుగా అలంకరించబడింది. ప్రజలందరూ తమ తమ

శక్తి సామర్థ్యాలను బట్టి ప్రభువుకు కానుకలు సమర్పించి తమ భక్తిని వెల్లడించారు. పుత్రజననంతో తన సర్వార్థాలూ సిద్ధించాయికనక శుద్ధోదను డాబాలునకు సిద్ధార్థుడని పేరు పెట్టాడు. గౌతముడనే పేరుకూడా తర్వాత వాడుకలోకి వచ్చింది.

శుద్ధోదనునకు కుమారుడు కలిగాడన్నవార్త తెలియగానే అంతకుముందు యెన్నో యుగాలనుంచి పర్వత గుహాంతరాళాలలో తపస్సు సాగిస్తున్న అసితుడనే మహర్షి కపిలవస్తు నగరానికి వచ్చి, రాజుతోసహా అంతఃపురానికి వెళ్ళి పసిబిడ్డనికి ప్రదక్షిణంచేసి, యింతటితో తను కృతార్థుడ నయ్యానని, యీ బాలుడు ప్రపంచాన్ని ఉద్ధరించగల మహానుభావుడని పలికి వెళ్ళిపోయాడు. రాజదంపతులు తమ పసిపాపను చూసి మురిసిపో సాగారు.

ఇలా వారంరోజులు గడిచింది. ఆనాడు మాయాదేవి తనముద్దుల పుత్రుని ఒడిలో పరుండబెట్టుకుని తనివిదీరా ఆనందిస్తూనే అశ్రువులు రాల్చసారంభించింది. అదిచూసి ప్రజావతి చంటిబిడ్డను మాయ ఒడినుంచి తీసివేసి ఆమె కళ్ళ నీళ్లు తుడిచి ఆమె శిరస్సును తన ఒడపై చేర్చి ఉపచర్య చేయ సాగింది. అయితే అది పారవశ్యమో, హృదయావేగమో, సమ్మోహమో తెలియదుగాని ఆఖరుసారిగా కన్నబిడ్డను ముద్దు పెట్టుకుని మాయాదేవి కళ్ళుమూసింది. అంతే......

మూసినకళ్ళు మూసినట్లే వున్నాయిగాని యెంతకూ తెరవ

బడలేను. ఆమె జీవితాశ్వాసం సమాప్తమైపోయింది. అంత వరకూ కలకలలాడుతూన్న కపిలవస్తునగరం వెలవెల బోయింది. శుద్ధోదనుని జీవితం అంధకార బంధురమైంది.

## బాల్యం

మాయాదేవి మరణంతో సిద్ధార్థుని పెంపక బాధ్యతను ప్రజాపతి వహించింది. కాలం గడుస్తున్నకొద్దీ శుద్ధోదనుడు పుత్రుని చూసి జీవిస్తూ భార్యసంగతి మర్చిపోసాగాడు. సిద్ధార్థుని అల్లారుముద్దుగా పెంచడానికి అన్నిహంగులూ ఏర్పాటు చేయబడ్డాయి. కన్నతల్లిలేని ఒకే ఒక పెద్దకొటుతప్ప యితర లోటేదీ లేదాబాలునకు. ప్రజాపతికూడా ఆ పిల్లవానిని తన కన్నకొడుకువలె చూసుకుంటూ యెంతో ఆదరంతో పెంచేది. క్రమంగా సిద్ధార్థునకు అయిదేళ్ళు వచ్చాయి. ఒక శుభ ముహూర్తాన శుద్ధోదను డతనికి అక్షరాభ్యాసం జరిపించాడు. సిద్ధార్థుడు అత్యంత బుద్ధికుశలత కలవాడు కావడంవల్ల కొద్ది కాలంలోనే వేద, శాస్త్ర, పురాణాదు లన్నిటినీ చదివి వాటి సారాంశాన్ని ఆకళింపు చేసుకున్నాడు.

చిన్నతనంనుంచీ సిద్ధార్థుడు నడచిన నడతను పరిశీలిస్తే అతనికి పుట్టుకతోనే సుగుణాలు అలవడ్డా యనిపిస్తుంది. వాటన్నిటిలో 'దయ' అత్యంత ప్రధానమైనది. అతనిలోగల ఆ మహత్తర సుగుణానికి లెక్కలేనన్ని నిదర్శనాలున్నాయి. చిన్నప్పుడతడు తోటి బాలురతో కలసి ఆడుకుంటూవుండగా

చాలా హంసలు బారులుదీర్చి ఆకాశమార్గాన ఎగిరిపోతున్నాయి. అపుడు దేవదత్తుడను నొకడు బాణంతో ఒక హంసను కొట్టాడు. వెంటనే అది నేలపైకూలింది. అందులోనూ సిద్ధార్థునికి దగ్గరగా పడింది. ఆ దృశ్యం చూడగానే సిద్ధార్థుని మనస్సు చివుక్కుమనిపోయింది. తక్షణమే అతడా హంసను చేతిలోకి తీసుకుని, దాని శరీరానికి గుచ్చుకునివున్న బాణాన్ని వూడదీసి, తన మెత్తనివేళ్ళతో ఆగాయాన్ని మెల్లగా నిమురుతూ దాని బాధను పోగొట్టడానికి తాపత్రయపడసాగాడు. ఇంతలో దేవదత్తుడువచ్చి తాను దానిని వేటాడాననీ, యిచ్చివేయమని సిద్ధార్థుడితో అన్నాడు. సిద్ధార్థుడు అందు కంగీకరించక జీవహింస ఘోరాతిఘోరమని వక్కాణించాడు. ఎంత యత్నించినా దేవదత్తుడు సిద్ధార్థుని వద్దనుంచి హంసను తీసుకోనలేక పోయాడు. తర్వాత సిద్ధార్థుడు ఆ హంసను తనగృహానికి తీసుకువెళ్ళి ప్రేమతో చికిత్సచేసి కొన్నాళ్ళయిన తర్వాత తిరిగి ఆకాశ మార్గానికి విడిచిపెట్టాడు.

## వివాహం

సిద్ధార్థుడు క్రమంగా పెరిగి యౌవనవంతు డయ్యాడు. అప్పటికతడన్ని విద్యలూ నేర్చుకుని విశేషంగా విజ్ఞానాన్ని సంపాదించాడు కూడా. అయితే, మొదటినుంచీ అతనిలో వైరాగ్యభావాలే పెంపొందసాగాయి. ప్రాపంచిక వ్యవహారాలపై అతని కెన్నడూ

శ్రద్ధలేదు. భోగాలనుభవించడ మతనికి కిట్టదు. ఏ ప్రాణికైనా ఆపద సంభవిస్తేమాత్రం అతని గుండె నీరైపోయేది. ఈ వైఖరిని కనిపెట్టిన శుద్ధోదనునకు ఆనాడు దైవజ్ఞులు చెప్పినమాట జ్ఞప్తికివచ్చింది. తనకుమారుడు సన్యాసిగా మారిపోగలడేమోనన్న ఆందోళన అతనిని బాగా కలవరపెట్టింది. ఎలాగైనా సిద్ధార్థుని మనస్సు మార్చాలనే సంకల్పంతో అతడెన్నో ప్రయత్నాలు చేశాడు. కుమారునికి ఆహ్లాదాన్ని కలిగించే నిమిత్తం అతడొక సౌధాన్ని ప్రత్యేకంగా నిర్మింపచేసి దానికి నాలుగువైపులా మనోహరమైన ఉద్యానవనాన్ని ఏర్పాటు చేయించాడు. సిద్ధార్థునకు కావలసినవన్నీ అక్కడకే వెళ్లేటట్లు చేశాడు. ప్రజల కోలాహలంకాని, ఆర్తనాదాలుకాని ఆ ప్రాంతంలో యెక్కడా వినబడకుండా కట్టుదిట్టాలు చేశాడు. అయితేమాత్రం స్థిరసంకల్పుడైన సిద్ధార్థుని మనస్సు అంతలో మారుతుందా ?

ఈ యత్నాలవల్ల యేమంత ప్రయోజనం కనబడకపోవడంవల్ల సిద్ధార్థునకు వివాహంచేస్తే తప్పక అతనిమనస్సు మామూలుదారికి రాగలదని శుద్ధోదనుడు భావించి అందుకు సిద్ధార్థుని అభిప్రాయాన్ని కోరాడు. కాని వెంటనే సిద్ధార్థుడు ఏ సమాధానమూ యీయలేదు. వారం రోజులలో తన నిర్ణయం చెప్పగలనన్నాడు. ఆవారం రోజులూ అతడు తన వివాహ విషయాన్ని గురించే తీవ్రంగా యోచించాడు. ఒక ప్రక్క తనతండ్రికోరిక–వంశగౌరవం–రాజ్య సౌభాగ్యం–ప్రజా

సౌఖ్యం, మరొకప్రక్క ఆత్మాభిలాష-దయా ధర్మ ప్రేరణ-జీవకల్యాణం-జగదానందం. వీటిలో యేది నెరవేర్చడమోననే సందేహం అతనిని తీవ్రంగా వేధించింది. రాత్రింపగళ్ళు అదే పనిగా ఆలోచించిన తర్వాత అతనొక నిశ్చయానికి రాగలి గాడు. జీవితంలో ఆదర్శ ప్రాయుడు కాదలిస్తే సంపూర్ణాదర్శ ప్రాయుడే కావాలని అతని అభిప్రాయం. వివాహం చేసుకోనక పోతే జీవితం అసంపూర్ణంగా వుండిపోతుంది. కనక వివాహం చేసుకోనడానికే నిర్ణయించుకున్నాడతడు. ఆ సంగతి తెలియ గానే శుద్ధోదనుడు అపరిమితానంద భరితుడై అనుకూలవతి అయిన కన్యను వెదకడానికి ఏర్పాట్లు చేయించాడు మంత్రులూ, పురోహితులూ మొదలైనవారంతా కన్యాన్వేషణలో నిమగ్నులయ్యారు. వారంతా పెక్కుమంది రాకుమార్తెల సుగుణ సంపద లనుగురించి సిద్ధార్థునికి తెలియచేయ సాగారు. అయితే తన సహధర్మచారిణి ఎలావుండాలో సిద్ధార్థుడే స్వయంగా నిర్వచించాడు. ఒకనాటి సాయంత్రం రాజప్రాసాదంలో పరివార బృందంచే నియమితులైన పెక్కుమంది కన్యకలు సమావేశమయ్యారు. వారిలో దండపాణి అనే రాజుయొక్క కుమార్తె అయిన యశోధరను వివాహమాడాలని సిద్ధార్థుడు సంకల్పించాడు. ఈ విషయాన్ని శుద్ధోదనుడు ఒక పురోహితుని ద్వారా దండపాణికి తెలియచేశాడు. అయితే దండపాణికి శుద్ధోదనుని రాజ్య వైభవాన్ని గురించి తెలిసినప్పటికీ, సిద్ధార్థుని గుణగణాలు తెలియక పోవడంవల్ల మొదట్లో అతడు తన కుమార్తె

నీయడానికి అంగీకరించలేదు. శుద్ధోదనుడు డంము కాశ్చర్య పడ్డాడు. దండపాణి కితని విషయాలేవి తెలియవు గనక అతని యెదుట తనశక్తి సామర్థ్యాలను కనబరచడానికి సిద్ధార్థు డంగీకరించాడు. ఒకనాడు దండపాణిచే ఏర్పాటు చేయబడిన రాజ సభలో సిద్ధార్థుడు పాల్గొని ధనుర్విద్య, అశ్వారోహణ విద్య, జ్యోతిష్యం, వ్యాకరణం, సాంఖ్యము, యోగం, పురాణం మొదలైన వాటినన్నిటినీ అత్యద్భుతంగా ప్రదర్శించి సభాసదుల ప్రశంశలు పొందాడు, అంతట దండపాణి సంతోషంతో తన కుమార్తె అయిన యశోధరను సిద్ధార్థున కిచ్చి మహావైభవంగా వివాహం జరిపించాడు.

## వైరాగ్య సూచనలు

వివాహానంతరం యశోధర సిద్ధార్థులు కపిలవస్తు నగరంలో కొంతకాలంపాటు హాయిగా తమ కాలాన్ని వెళ్లబుచ్చారు. అయితే సిద్ధార్థుడు మొదటినుంచీ ఏ వైరాగ్య భావాలతో వున్నాడో ఆ భావాలుమాత్రం అతనిని విడిచిపెట్టలేదు. జర, మరణం, ఆర్తనాదం, హింస, మొదలైనవాటిని తల్చు కున్నపుడల్లా అతనిమనస్సు ఆవేదనతో కృంగిపోయేది.

ఒకనాటి రాత్రి అతనికి నిద్రాభంగమైంది. మానవ కోటి అనుభవిస్తున్న కష్ట నష్టాలను గురించి అతడు తీవ్రంగా ఆలోచించాడు. వాటి విముక్తికి మార్గాన్ని అన్వేషించాలని

భావించాడు. దానితో అతనిమనస్సు పూర్తిగా మారి పోయింది. నానాటికీ సంసార సుఖాలపై విరక్తి పెరగ నారంభించింది. యశోధర యీ సంగతిని గుర్తించక పోలేదు. అయినా తనమాత్రం భర్తకు సేవచేయడంలో ఏలోటూ లేకుండా జాగ్రత్త వహించేది. క్రమంగా సిద్ధార్థుని పరివర్తన విషయం శుద్ధోదనుని వరకూ ప్రాకిపోయింది. అప్పటికి శుద్ధోదనుడు రాజ్యభారాన్ని సిద్ధార్థున కప్పగించి తాను విశ్రాంతి తీసుకోవాలని తలపోస్తూ వుండడంవల్ల యీ వార్త అతనికి చెప్పరానంత ఆవేదన కలిగించింది.

సిద్ధార్థుడు విద్యావంతుడూ, వివేకవంతుడూ కావడం వల్ల అతనికి నిత్యమూ ఎన్నో సందేహాలు కలుగుతూ వుండేవి. వాటిని నివృత్తి చేసుకొనడంకోస మతడు కొన్నాళ్ళపాటు యత్నించాడు. కాని ఆలోచించినకొద్దీ సందేహాలు పెరిగి పోతూ వుండడంవల్ల అన్నిటిపైనా అశ్రద్ధ వహించ నారం భించాడు. యేవిషయంపైనా అతనికి అభిరుచి లేకుండా పోయింది. ఇతరు లెవరితోనూ కలసి మసలడానికి యిష్టంలేక ఒంటరిగా వుండసాగాడు. సాధారణంగా సాయంత్రం అతడు రథంపై నగర బాహ్యప్రదేశానికి విహారం నిమిత్తం వెళ్లేవాడు. ఒకరోజున అతడు మామూలుగా రథంపై నగరంలో తిరు గుతూ ఒకచోట వ్యాధిగ్రస్తుడై బాధపడుతున్న ముసలి వానినీ, మరొకచోట మృతకళేబరాన్నీ చూశాడు. ఆ రెండు సంఘటనలతోనూ అతని హృదయం చెరువై పోయింది.

మరికొంత దూరం వెళ్ళేసరికతనికొక సన్యాసి కన్పించాడు. దానితో సన్యాసాశ్రమాన్ని స్వీకరించడం అత్యుత్తమమని సిద్ధార్థునకు తోచింది. నాటికతడు విహారాన్ని చాలించి యింటికి వెళ్ళిపోయాడు.

## గృహ పరిత్యాగం

ఆ రాత్రిసిద్ధార్థునకు నిద్రపట్టలేదు. జర, మరణం, దుఃఖం యివే అతనిని కలచివేయ సాగాయి. అంతర్వాణి అతనితో యిలా పలికింది. "ప్రియురాలి ప్రేమలో కానవచ్చే స్వర్గమొక్కటే పరమావధి కాదు ప్రపంచంలో యెంతోమంది దీనులు, దరిద్ర నారాయణులు, మ్లానతనులు విచారంతో కృశించి, నశించి పోతున్నారు. లే! వెంటనే వెళ్ళి వారి అశ్రుకణాలను తుడిచి వెయ్యి. అక్కడ నీకు కోట్లాది స్వర్గాలు లభిస్తాయి. బుద్ధుడవై నువు పుడమిని ప్రబుద్ధులుగా మార్చు."

అంతర్వాణి పలికిన పై మాటలు వినగానే సిద్ధార్థుడు ఏమైనాసరే సన్యాసాన్ని స్వీకరించాలనే నిశ్చయానికి వచ్చాడు. అయితే యీ వార్తను తనతండ్రికీ, భార్యకూ కూడా నచ్చచెప్పి వారి అనుమతిని పొందాలనే సంకల్పంతో అతడు సమయంకోసం చూడసాగాడు. ఈలోగా సిద్ధార్థున కొక పుత్రుడుదయించాడు. దానితో అతని ఆరాటమరింత

హెచ్చింది. సంసారబంధం యింకా దృఢతరం కాకూడదని అతని అభిప్రాయం.

ఒకనాటిరాత్రి సిద్ధార్థుడు తన తండ్రివద్దకు వెళ్ళి ప్రశాంతంగా అతని వద్ద కూర్చుని తన అభీష్టాన్ని వివరించాడు. శుద్ధోదనుడు పట్టరాని దుఃఖంతో బాధపడుతూ కుమారుని మనస్సు మార్చడానికి తాపత్రయ పడ్డాడు. తన సర్వస్వాన్నీ, తుదకు రాజ్యాన్నీ ధారపోసి అయినా సరే అతనికి అవసరమైనవన్నీ సమకూర్చగలననీ, సన్యాసాశ్రమాన్ని స్వీకరించవద్దనీ యెన్నోవిధాల ప్రతిమాలాడు. కాని సిద్ధార్థుడు తండ్రితో తాను జరా, వ్యాధి, మృత్యువుల నతిక్రమించి చిరయౌవనాన్ని పొందడానికి కృషిసాగిస్తాననీ, సోదర ప్రజల కష్టాలు తొలగించడానికి మార్గాన్ని అన్వేషిస్తాననీ, తనదానికి అడ్డుతగలక ఆశీర్వదించవలసిందనీ అన్నాడు. గత్యంతరంలేక బరువెక్కిన హృదయంతోనే శుద్ధోదనుడు సిద్ధార్థుని సన్యాసాశ్రమ స్వీకారానికి అంగీకరించి ఆశీర్వదించాడు. సరే. తండ్రి అనుమతి లభించింది. ఇక యిల్లాలితో కూడా ఒక్కమాట చెప్పిపోవడం ఉత్తమమని సిద్ధార్థుడు యశోధర మందిరానికి వెళ్ళాడు.

అది అర్ధరాత్రి. ప్రపంచమంతా నిద్రావస్థలో వుండడంవల్ల నిశ్శబ్దత తాండవిస్తున్నది. తడబడుతున్న కాళ్ళతో, అతడు యశోధర చెంత నిలబడ్డాడు. కాని పాపం! ఆ అమాయకురాలి కేమి తెల్సు! ఆమె పసిబిడ్డను కౌగలించుకొని గాఢంగా

నిద్రపోతున్నది. సిద్ధార్థుడు రెండు మూడు సార్లు భార్య వైపూ, పుత్రుని వైపూ చెప్పవాల్చకుండా చూశాడు. తన ఆశ్రమ స్వీకారం సంగతి చెప్పాలన్న సంకల్పంతో యశోధ రను లేపబోయాడు. మళ్లా యింతలోనే చెయ్యి వెనక్కు లాగేసింది. నోట మాటరాలేదు. ఆమె నిద్రనుంచి మేల్కొంటే తన ప్రయాణం సాగదేమోనన్న అనుమానం కలిగింది. అతడా ప్రయత్నాన్ని విరమించుకున్నాడు. నిశ్చయంగా ఆ సమ యంలో యశోధర లేచివుంటే సిద్ధార్థుని జీవితం మరొక విధంగా వుండేది. పోనీ యిల్లాలుతో చెప్పకపోయినా ఒక్క సారి కుమారుని యెత్తుకుని ముద్దుపెట్టుకోవా లనుకున్నా డతడు. అయితే అదీ లాభంలేదు. పసిబిడ్డను తీయగానే యశోధరకూడా లేవగలదు. అందువల్ల కోరికను కూడా విడిచిపెట్టాలి.

ఇక అక్కడ తనకు పనేమున్నది ? ఆఖరుసారిగా మాతా శిశువుల వైపుచూసి, తనలోనే వారిని ఆశీర్వదించి మెల్లగా బయటపడ్డాడు సిద్ధార్థుడు. వెంటనే అతడు అంతఃపురంనుంచి బయటకువచ్చి అశ్వపాలకునిపిల్చి తన అభిప్రాయాన్ని తెల్పి ఒకగుర్రాన్ని తీసుకురమ్మన్నాడు. అశ్వపాలకుడు సిద్ధార్థుని మాటలు వినగానే నిశ్చేష్టుడై పోయాడు. కాని అతని ఆజ్ఞాను సారం గుర్రాన్ని తీసుకువచ్చాడు. అశ్వపాలకుడు వెంటరాగా సిద్ధార్థుడా గుర్రంపై కపిలవస్తు నగరాన్ని విడిచి వెళ్ళి పోయాడు.

## సన్యాసాశ్రమ స్వీకారం

రాత్రి బయలుదేరిన సిద్ధార్థుడూ, అశ్వపాలకుడూ తెల్లవారేసరికి 'అనమా' నదీతీరానగల ఒక అడవికి చేరుకున్నారు. అక్కడ సిద్ధార్థుడు తన శరీరంపైగల ఆభరణాలన్నిటినీ తీసివేసి అశ్వపాలకున కిచ్చేశాడు. కట్టుబట్టలను తీసి ఆదారిని పోతున్న బోయవాని కిచ్చివేశాడు. ఆ బోయవాడు కట్టుకున్న జీర్ణ వస్త్రాన్ని తాను కట్టుకున్నాడు. తర్వాత అతడు గుర్రాన్ని రాజధానికి తోలుకు పోవలసిందని అశ్వపాలకుని కోరాడు. సిద్ధార్థుని కొత్తవేషం చూడగానే అశ్వపాలకునకు దుఃఖం పొంగిపోయింది. చంటిపిల్లవానివలె అతడు బిగ్గరగా విలపించాడు. అందుకు కారణం సిద్ధార్థునిపట్ల వానికిగల అనురాగం. అంతకుముందు తండ్రివద్ద సెలవు తీసుకునే సమయంలోనూ, యిల్లాలినీ, పసిపాపనూ వదలిపెట్టే సమయంలోనూ కూడా మనస్సును నిగ్రహించుకొనకలిగిన సిద్ధార్థుడు అశ్వపాలకుని ఏడుపుతో చలించిపోయాడు. అతని కళ్ళనుండికూడా బొటబొట నీళ్ళు రాలాయి. కొంతసేపయిన తర్వాత సిద్ధార్థుడు అశ్వపాలకుని వెళ్ళిపొమ్మని చెప్పి తాను ముందుకు ప్రయాణమయ్యాడు.

'వైశాలీ' నగరమార్గాన్ని అనుసరించిపోతున్న సిద్ధార్థుడు దారిలో శాక్య, పద్మ అనే యిద్దరు బ్రాహ్మణ పత్నుల ఆతిథ్యాన్ని స్వీకరించాడు. తదుపరి అతడు బ్రహ్మర్షి అయిన

దేవతుని ఆశ్రమం చేరుకున్నాడు. బ్రహ్మర్షి అతనికాతిథ్యమిచ్చి ఆదరించాడు. సిద్ధార్థుడక్కడ వైశాలీ నగరవాసుడైన 'అరాడకలామి' అనే ప్రసిద్ధ దార్శనిక పండితుని పరిచయం సంపాదించాడు. ఆ పండితుని ప్రతిభా విశేషాలచే సిద్ధార్థుడు ఆకర్షించబడి కొన్నాళ్ళపాటు అక్కడుండి ఆయనకు శుశ్రూష చేయాలని నిశ్చయించుకున్నాడు. ఆ సంగతి తెలియగానే పండితుడు సిద్ధార్థుని పూర్తి వృత్తాంతాన్ని తెల్సుకుని ఆశ్చర్యపడి తనవద్ద వుండడానికి అంగీకరించాడు ఆ పండితునకు చాలామంది శిష్యులున్నారు. వారికాయన దర్శన యోగ శాస్త్రాలలో పాఠాలు చెప్పాడు. సిద్ధార్థుడు కొంతకాలంపాటు అక్కడుండి ఆయన ఉపదేశాన్ని పొంది యోగాభ్యాసంకూడా చేశాడు. అయితే దానివల్ల అతనికి సంతృప్తి లభించలేదు. కనక ఆ పండితునివద్ద సెలవుతీసుకుని మగధదేశం వెళ్ళి పోయాడు.

అప్పుడు మగధదేశానికి రాజధాని రాజగృహం. రాజు బింబిసారుడు. ఒకరోజున భిక్షనిమిత్తమై సిద్ధార్థుడు రాజగృహ సమీపానికి వెళ్ళాడు. పురప్రజలందరూ అతని రూపురేఖలూ, తేజస్సూ చూసి నివ్వెరపోయారు. అతడు మానవమాత్రుడో, దేవదూతయో కూడా వారు గుర్తుపట్టలేక పోయారు. క్రమంగా యీవార్త బింబిసారునికి తెల్సింది. వెంటనే అతని దర్శనం చేయాలన్న ఆకాంక్షతో బింబిసారుడు పరివార సమేతంగా సిద్ధార్థునివద్దకు వెళ్ళాడు. సిద్ధార్థుడు

కనబడగానే బింబిసారు డతనికి నమస్కరించి "మహానుభావా! మీ దర్శనభాగ్యంవల్ల నేను కృతార్థుడనయ్యాను. మీరు దయతో రాజ్య శాసన విషయాలలో నాకు సహాయపడండి. రాజ్య భారమంతా మీకే అప్పగించగలను. ఇటువంటి సకల భోగాలనూ అనుభవించండి" అన్నాడు. అంతట సిద్ధార్థుడు నవ్వుతూ "రాజా! మీ ఆదరానికి కృతజ్ఞుడ్ని. నాకేటువంటి సుఖవాంఛలూ లేవు. కోరిక విషతుల్యమైనది, అమంగళా లన్నిటికీ యీ వాంఛలే మూలకారణం" అన్నాడు. దానితో సిద్ధార్థునిపై బింబిసారునకు అపారమైన ప్రేమ యేర్పడింది. అతడు జగద్గురువు కాగలడని తోచింది వెంటనే రాజు సిద్ధార్థుని వృత్తాంతాన్ని పూర్తిగా తెల్సుకుని "స్వామీ! తమ సాధన సిద్ధించి తమరు బుద్ధులయితే నేను మీ ధర్మాన్నే అవలంబిస్తాను" అని చెప్పి వెళ్ళిపోయాడు.

దార్శనిక పండితుని ఉపదేశం తృప్తిని కల్గించక పోవడంవల్ల సిద్ధార్థుడు మరొక గురూత్తముని కోసమై అన్వేషించ సాగాడు. రాజగృహ సమీపానికి వెళ్లినప్పుడత డొక పండితుని గురించి తెల్సుకున్నాడు. ఆయన దార్శనిక మతం మరొక విధమైనది. ముక్తిలాభం పొందాలంటే శ్రద్ధ, వీర్యం, స్మృతి, సమాధి, ప్రజ్ఞ—యీ అయిదింటి సహాయం కావాలని ఆయన బోధిస్తాడు, వాటి సహాయంవల్ల ముక్తిని పొందినవారు జ్ఞానజ్ఞాన ద్వంద్వానికి అతీతులు కాగలరని ఆయన భావం. ఆ పండితుని పేరు రుద్రకుడు. సిద్ధార్థుడు

కొన్నాళ్ళపాటు ఆయన ఉపదేశాన్నికూడా పొందాడు. అయితే అతనికి అదీ రుచించలేదు. అందువల్ల అతడక్కడనుంచి బయలుదేరి దయాశీర్ష పర్వతానికి వెళ్ళాడు. అక్కడ ఒక్కడూ చాలారోజులు ధ్యానధారణాభ్యాసాలు కావించి అనేక ధర్మ రహస్యాలను అవగతం చేసుకున్నాడు. దానిఫలితంగా అతడు మానవుడెంతకాలం కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యాలకు వశుడై వుంటాడో అంతకాలమూ అతడు దివ్యజ్ఞానలాభాన్ని పొందలేడని గ్రహించాడు.

ఎంతయత్నించినా సరియైన గురువు దొరకనందువల్లనూ, తన ఆశయసిద్ధికి దారి కనబడనందువల్లనూ సిద్ధార్థుడు విచారపడుతూ తిరగసాగాడు. పోతూ, పోతూ ఒకరోజున అతడు 'ఉరుబిల్వ' మనే గ్రామం చేరుకున్నాడు. అక్కడే నిరంజన నది వున్నది. అంతవరకూ తిరిగి, తిరిగి అలసిపోయిన సిద్ధార్థుడు ఆ ప్రాంతంలోనే ఒక చెట్టునీడను విశ్రమించాడు. ఆ ప్రాంతమంతా అత్యంత ప్రశాంతంగానూ, మనోహరంగానూ వున్నది. అప్పటినుంచీ అతడు దానినే తన సాధనభూమిగా ఏర్పరచుకున్నాడు.

## యోగసాధన

సమస్త శాస్త్రాలనూ విచారించి చూసిన సిద్ధార్థునకు వాటివల్ల తనలక్ష్యం సిద్ధిస్తుందనే నమ్మకం కలగలేదు. ఒకనాడతనికి అరణి సంఘర్షణవల్ల అగ్నిని పుట్టించే విధానం జ్ఞాపకమొచ్చిందది.

ఆర్ద్రకాష్ఠాన అగ్ని పుట్టలేదు. కట్టెలేకపోతే నిప్పు రాజుకోవటం సాధ్యంకాదు. దేహం-మనస్సు-యీ రెండూ కూడా కాష్ఠం వంటివే అని అతను గ్రహించాడు. భోగం-విషయాసక్తి-యీ రెండూ నీరువంటివనికూడా అతను తెల్సుకున్నాడు. భోగవాంఛ, విషయాసక్తి దేహానికీ, మనస్సుకూ ఆర్ద్రతను కలిగిస్తాయి. అందువల్ల వాటిసంఘర్షణవల్ల దివ్యజ్ఞానం లభించదు. కనక దివ్యజ్ఞానం పొందాలంటే దేహాన్నీ, మనస్సునూ శుష్కింపచెయ్యాలి. దేహం కృశింపజేయడానికి కృచ్ఛ్ర చాంద్రాయణ వ్రతాది సాధనలు ఉపకరిస్తాయి. వైరాగ్యంవల్ల మనస్సును వికారశూన్యం చేయవచ్చు. ఈ ఆలోచన తట్టడంతో యోగసాధనమే కర్తవ్యమని సిద్ధార్థుడు నిర్ణయించుకున్నాడు. వెంటనే అతను యోగాసనమునందు కూర్చుని 'ఆస్ఫానక' యోగాన్ని ప్రారంభించాడు. శ్వాసను బంధించి యోగాభ్యాసం చేయసాగాడు. ఇది అత్యంత కఠినమైనది. అయినా అతను లెక్కచేయలేదు. ఆకలి, దప్పులను కూడా అణచుకోవడం మొదలుపెట్టాడు. ఆ సమయంలో సిద్ధార్థునితో అయిదుగురు శిష్యులుండేవారు. వారతనికి ఫలాదులు తెచ్చి శుశ్రూష చేసేవారు. ఎండ-వాన-చలి కూడా లెక్కచేయక సిద్ధార్థుడు తన సాధన సాగించాడు. శరీరమంతా కృశించిపోయింది. క్రమంగా అతను ఆహార, పానీయాలేవీ ముట్టకుండా రాత్రింపగళ్ళు తీవ్రసాధనలోనే నిమగ్నుడై పోయాడు.

ఇలా ఆరుసంవత్సరాలు గడిచాయి. ఒకనాడతని యోగం భంగమయింది. అయితే కోరిక సిద్ధించలేదు. దానితో అతడు కొంత విచారపడి అలాగే చూస్తూ వుండిపోగా అతని మనోనేత్రానికొక దివ్యసందర్శనం కలిగింది. దేవేంద్రుడు వీణను మ్రోగించుకుంటూ ఆకాశపథాన సంచరిస్తున్నాడు. దాని తీగలలో ఒకటి అసంబద్ధమై వున్నది ఇంకొకటి బాగా బిట్టుగా వున్నది. మధ్యతీగ మామూలుగా వున్నది. దేవేంద్రుడు తీగలను మీటగా మధ్యతీగమాత్రం మధుర స్వరాన్ని వెలయిస్తోంది గాని తక్కిన రెండూ అస్పష్టంగానే మ్రోగుతున్నాయి. ఈ దృశ్యం కనబడగానే సిద్ధార్థుడు దీనిని గురించి ఆలోచించ నారంభించాడు. మానవజీవితాన్ని కూడా యీ వీణతో పోల్చవచ్చు. జీవనతంత్రుల్ని అసంబంధంగా బిగిస్తే భోగలాలస జీవితమేర్పడ గలదు. అందువల్ల ప్రకృత స్వరగ్రామాలు పలుకవు. ఉత్కటసాధనవల్ల శరీరాన్ని నిగ్రహించి జీవనతంత్రిని బిట్టుగా బిగించినా అనర్థమే కల్గుతుంది. కనక మధ్యమ మార్గమే అన్నివిధాలా ఉత్తమమైనది. అంత వరకూ సిద్ధార్థుడు రాజభోగాలనూ, ఉపవాస దీక్షనూ కూడా అనుభవించాడు కాని తనలక్ష్యం నెరవేరలేదు. అందుచేత మధ్యమ మార్గాన్ని అవలంబించాలని నిశ్చయించుకున్నాడు.

ఇక సిద్ధార్థుడు యోగాసనాన్ని కట్టిపెట్టాడు. ఎన్నో సంవత్సరాలు ఆహారపానీయాలు లేక శుష్కించి పోవడంవల్ల అతడు కదలలేక చెట్టుక్రింద పడిపోయాడు. కొంతసేపటికి

స్ఫురించింది. ఆ సమయానికి ఒక వనిత వనదేవతార్చ నిమిత్తం అక్కడకు పిండివంటలతో సహా అన్నం తీసుకు వచ్చింది. ఆ వనదేవత ప్రభావం వల్ల తనకు సంతానం కలిగిం దన్న భక్తితో ఆమె దేవతాప్రీతికై ఆ అన్నం తీసుకు వెళ్ళింది. ఆమె సిద్ధార్థుని చూడగానే దేవతామూర్తి అని భావించి ఆ పదార్థాలన్నీ అతనికి సమర్పించింది. సిద్ధార్థుడా మృష్టాన్నాన్ని ఆప్యాయంతో భుజించాడు. అతడిలా ఆహా రాన్ని తీసుకోవడాన్ని చూసి కూడా వున్న శిష్యులు వెళ్ళి పోయారు. తర్వాత సిద్ధార్థుడు మళ్ళా ఒంటరిగా ఆ ప్రాంతంలో తిరగసాగాడు. అతనిలో వ్యాకులత హెచ్చింది. రాత్రింబవళ్ళు తీవ్రంగా ఆలోచించి ఆఖరుకు ధ్యానధారణం కావించ డానికి నిర్ణయించుకుని అడవిమధ్యకు వెళ్ళి ఒక పెద్ద మర్రిచెట్టు క్రింద పద్మాసనాసీనుడై ధ్యానం ప్రారంభించాడు.

## ధ్యానధారణం

యోగసాధనలో సిద్ధార్థునకు నమ్మకం పోయిందని పైన చెప్ప బడిందికదా! ధ్యానం మొదలుపెట్టినా ప్రారంభదశలో అతని కెన్నో సంశయాలు కలిగాయి. అవన్నీ తన ఆశయసిద్ధికి అనుస రించవలసిన మార్గాన్ని గురించినవే. ఒకప్రక్క ఆశాపిశాచాలూ, మరొకప్రక్క సందేహ పరంపరలూ హృదయంలో దట్టంగా కమ్ముకుని అతనిని పరీక్షించ సాగాయి. అవి నిజంగా

అగ్నిపరీక్షయే. దానికి తట్టుకొనలేనివారు నశించి పోతారు. తట్టుకొనగల్గినవారు విజయవంతులై ప్రకాశిస్తారు. జీవితచరితలలోగల మానవాదర్శాల గొప్పతనమూ, కష్టపరంపరల సహిష్ణుత మొదలైనవన్నీ యిటువంటి పరీక్షలలోనే విశదం కాగలవు. అసలు సిద్ధార్థుని లక్ష్యమేమిటి? ప్రపంచంలో యెటువంటి పవిత్రత, పుణ్యం వున్నాయో వాని ప్రాధాన్య సంస్థాపనను గురించినయత్నం అపవిత్రత, పాపం, దుఃఖం మొదలైనవాటి నిర్మూలనం. ఇదినిజంగా అనన్యసామాన్యమైన మహత్తర కృషి. సాధారణంగా మానవుడు తన ప్రయత్నంలో విఫలుడైనప్పుడు అతని మనస్సులో తన ఆత్మశక్తిపైనా, ఉద్దేశ్యంపైనా, అనుసరించే మార్గంపైనా సందేహాలు కలిగి తీరతాయి. సిద్ధార్థుడుకూడా అలాగే సంశయించి పూర్వాపరాలను తర్కించుకున్నాడు. భూతభవిష్యత్తులను గురించి ఆలోచించినపుడు ఆ రెండింటికీ నడుమ వర్తమానం కన్పించి ఆశను రేకెత్తిస్తుంది. సిద్ధార్థుడు యిలాగే ఒకప్రక్క ఆశతోనూ, వేరొకప్రక్క సందేహాంతోనూ మథనపడ్డాడు. గృహస్థాశ్రమంలో తాను అనుభవించిన భోగాలన్నీ అతనికి జ్ఞప్తికి వచ్చాయి. అయితే దానిలో అతనికి కొన్ని సందేహాలు కలిగాయి. పితృవాత్సల్యాన్ని, యిల్లాలిప్రేమనూ, సిరిసంపదలనూ వినిమయం గావించి తాను పొందినదేమిటి? దాని కేటువంటి పరిణామాలు కలిగాయి. అలా చేయనినాడు తనకిన్ని అవస్థలెందుకు? ఇతరుల దుఃఖాలను పోగొట్టడమే తన

లక్ష్యంకదా! కాని యింకా తనదుఃఖాన్ని నివారించుకొన డానికే సమర్థుడు కాలేదే! తాను అవలంభించిన మార్గాలు తన ఆశయసిద్ధికి ఉపకరించలేవుగదా! ఈ విధంగా అతడు పూర్వవిషయాలను స్మరణకు తెచ్చుకుని తన ఆశయసాధనకు యింకా దారిదొరకలేదని బాధపడుతున్నా తనలక్ష్యాన్ని మాత్రం విడవలేదు. నెమ్మదిగా అతడు తన సందేహాల నన్నిటినీ తరిమివేసుకుని చిత్తాన్ని ప్రశాంత వాతావరణంలో వుంచుకొనగలిగాడు. అక్కడతో అతని ధ్యానం తీవ్రరూపం దాల్చింది.

## జ్ఞానోదయం

నిర్మల హృదయంతో ఏకాగ్ర చిత్తుడై సిద్ధార్థుడు కావించిన ధ్యానం పూర్తిగా ఫలించింది. అతనికి జ్ఞానోదయమైంది. జన కోటి దుఃఖాలకు కారణాన్నీ, వాటి నివారణోపాయాన్నికూడా అతడు తెల్సుకొనగలిగాడు. అంతటితో సిద్ధార్థుడు బుద్ధు డయ్యాడు. అతడు ఏచెట్టుక్రింద కూర్చుని ధ్యానం కొనసాగించి దివ్యజ్ఞానాన్ని పొందాడో ఆ వృక్షం బోధివృక్షంగా కీర్తించ బడింది. ఉరుబిల్వ వనం పుణ్యక్షేత్రంగా అలరారింది.

బుద్ధుడు దుఃఖకారణాన్ని యిలా అవగాహన చేసు కున్నాడు.

1. అవిద్యనుంచి సంస్కారం పుట్టింది.
2. సంస్కారంనుంచి విజ్ఞానం కలిగింది.
3. విజ్ఞానంనుంచి నామరూపాదు లుదయించాయి.
4. నామరూపాలనుంచి షడాయతన ముత్పన్న మయింది.
5. షడాయతనమందు స్పర్శ పుట్టింది.
6. స్పర్శయందు వేదన జనించింది.
7. వేదనవుంచి తృష్ణ బయలుదేరింది.
8. తృష్ణ ఉపాదానానికి కారణభూత మయింది.
9. ఉపాదానం భవానికి మూలమయింది.
10. భవంనుంచి జాతి ఏర్పడింది.
11. జాతినుంచి జర, మరణం, శోకం, అనుతాపం, దుశ్చింత, ఉద్వేగం మొదలైన అన్నిదుఃఖాలూ ఉత్పన్నమయ్యాయి.

ఈ సూత్రాలకు అర్థాలు తెల్సుకొనడం అవసరంకనక యిూ క్రింద పొందుపరచబడ్డాయి.

1. అవిద్య-భ్రాంతిజ్ఞానం. వికృతబోధ.
2. భ్రాంతినుంచి మనస్సులో సంస్కారం ఉదయిస్తుంది.

3. సంస్కారంనుంచి విజ్ఞానం ఉద్భవిస్తుంది. ఇక్కడ విజ్ఞానమంటే సైన్సు కాదు. ఇంద్రియ జనితమైన దర్శనం, శ్రవణం, ఘ్రాణం, ఆస్వాదనం, స్పర్శ, చింతనం అనే బోధనలు.

4. రూపమూ, రసమూ, శబ్దమూ, స్పర్శ వీని బోధన చక్షురాదులయిన యింద్రియాలతో వస్తుసంయోగం వల్ల కలుగుతుంది, ఈ యింద్రియాల యొక్కయూ, వానిచే గ్రహించబడే విషయాల యొక్కయూ సంయోగమే 'స్పర్శ' అనబడుతుంది.

5. ఈ స్పర్శనుంచే సుఖం, సుఖదుఃఖా భావమయిన వేదనానుభూతి కలుగుతాయి.

6. వేదననుంచి తృష్ణ, కామము పుడతాయి.

7. తృష్ణనుంచి ఉపాదానం అంటే కర్మోత్పత్తి కలుగుతుంది.

8. ఉపాదానమంటే శారీరకం – మానసికం – వాచ్యం అనే యీ మూడువిధాలైన కర్మలనుంచీ ధర్మాధర్మాలు తలయెత్తుతాయి. ఈ ధర్మాధర్మాల ఫల భోగాలను అనుభవించడానికై జీవులు జన్మ పరంపరలు పొందగలరు.

9. జీవులు జన్మించిన తర్వాత వారికి జర, మరణాం, శోకం, అనుతాపం, దుశ్చింత, ఉద్వేగం మొదలైన దుఃఖానుభవాలు కలుగుతాయి.

ఈ రీతిగా కార్య కారణ విచారణ చేయగా అన్ని అనర్థాలకూ మూలకారణం అవిద్యయే అని బుద్ధుడు తెల్సుకున్నాడు అతడు జ్ఞానోదయాన్ని పొందిన నలభై తొమ్మిదవ రోజున ఆ బోధివృక్షం సమీపంలో తిరిగి ధ్యానధారణలో నిమగ్నుడయ్యాడు. అప్పుడతనికి దుఃఖ నివారణోపాయం కూడా దొరికింది. అవిద్యను నాశనం చేయాలంటే ఎనిమిది సూత్రాలను అవలంబించాలని అతడు గ్రహించాడు. అవి యిక్కడ పేర్కొనబడ్డాయి.

1. పవిత్ర మతం.
2. పవిత్ర భావం.
3. పవిత్ర కార్యం.
4. పవిత్ర వాక్యం.
5. పవిత్ర జీవితం.
6. పవిత్ర చేష్ట.
7. పవిత్ర చింతనం.
8. పవిత్ర స్మృతి.

## బౌద్ధ సిద్ధాంతాలు

బౌద్ధమత ముఖ్య సిద్ధాంతాలు నాలుగు. వీటిని బౌద్ధభాషలో 'భావన' అంటారు. అవి యిక్కడ వివరించబడ్డాయి.

1. "సర్వం దుఃఖం దుఃఖం" అంటే సంసారమంతా దుఃఖమయమని అర్థం.

2. "సర్వం క్షణికం క్షణికం" అంటే ప్రతి పదార్థం క్షణకాలం మాత్రమే వుంటుంది. రెండవక్షణంలో వుండదు. ఆత్మ అనేదొక స్వతంత్ర ద్రవ్యంకాదు. విజ్ఞానం, వేదన, సంజ్ఞ, సంస్కారం, రూపం అనే పంచ స్కంధాల పరిణామం. ఇప్పుడు ఆలోచించే ఆత్మ యింకొక క్షణానికి వుండదు. కొత్తది వస్తుంది. ముఖ్యంగా యిది విజ్ఞానమయం. పూర్వ విజ్ఞానం ఉత్తరవిజ్ఞానాన్ని అవలంబించి తాను అంతరిస్తుంది. ఇలా విజ్ఞానధార యెప్పుడూ ప్రవహిస్తూ వుంటుంది. అంటే యిదొక నదివంటిది. ఎప్పటికప్పుడు కొత్తనీరు వస్తుంది. పాత నీరు పోతున్నప్పటికీ నదిమాత్రం ఒక్క పేరుతోనే వ్యవహరించ బడుతున్నట్లు ఆత్మ ఒకటేనని చెప్పడం వ్యావహారికం.

3. "సర్వం స్వలక్షణం స్వలక్షణం" అంటే సృష్టిలోని ఒకవస్తువుతో యింకొక వస్తువును పోల్చడానికి వీలు లేదు. ఈ వస్తువు ఆ వస్తువువలె వున్నదనడం పొరపాటు. కనక ఏవస్తువు లక్షణ మావస్తువుకే చెల్లుతుంది. ఇతర వస్తువులకు చెల్లదు.

4. "సర్వం శూన్యం శూన్యం" అంటే అంతా సున్న అని దీని అర్థం.

ఈ చతుర్విధ భావనల యదార్థ జ్ఞానంవల్లనూ ముక్తి కలుగుతుంది. "సర్వం శూన్యం శూన్యం" అనే భావన యొక్క అర్థాన్ని గురించి బౌద్ధులలో నాలుగు శాఖాభేదాలు కలిగాయి. మాధ్యమికు లనేవారు సర్వాను స్యత్వాన్ని

అంగీకరించారు. యోగాచారులనే బౌద్ధులు బాహ్య శూన్యత్వాన్ని మాత్రం ఒప్పుకున్నారు. విజ్ఞానం సత్యమేనని వారి అభిప్రాయం. సౌత్రాంతికులనేవారు బాహ్యార్థాలు కేవలం అనుమేయాలుగాని ప్రత్యక్షాలు కావన్నారు. వైభాషికులు బాహ్యార్థాలే ప్రత్యక్షాలనీ, విజ్ఞానమే అనుమేయమనీ అన్నారు. బౌద్ధ సిద్ధాంతంలో కర్మ ప్రభావమెక్కువ. ఇక్కడ కర్మ అంటే యజ్ఞ యాగాది వైదిక కర్మకాదు. మానవుడు చేసే ప్రతిపనీ కర్మఅనే అర్థం. చేసిన చెడుపనికీ, మంచిపనికీ ప్రతిఫలాన్ని అనుభవించి తీరాలి. తప్పించుకొనడం యెవరికీ శక్యంకాదు. కనక చెడ్డపని చేయకుండానే వుండాలి. చేస్తే దానిఫలితాన్ని అనుభవించక తప్పదు. భగవంతునికి కొబ్బరికాయ కొట్టినంత మాత్రంలో ప్రయోజనం లేదు. మంచిచెడ్డల ఫలితాన్ని అనుభవించడానికై పునర్జన్మ లెత్తుతూ వుండాలి. కాని జన్మరాహిత్యాన్ని కోరేవారు కర్మ సన్యాసం తీసుకోవాలి.

తత్వవిచారం జనసామాన్యానికి తెలియదు. అందువల్ల బుద్ధుడు నీతివర్తనమే అందరకూ ముఖ్యమని చెప్పాడు. పరిశుద్ధాలోచన, పరిశుద్ధవాక్కూ, పరిశుద్ధాచరణము నిర్వాణానికి ప్రధాన సాధనాలు. పరోపకారం, భూతదయ ధర్మానికి ముఖ్యాంశాలు. ఇవి అందరకూ సాధ్యమైనవి. బ్రాహ్మణునికి ఆధిక్యత లేదు. శూద్రునికి నీచత లేదు. సత్ప్రవర్తన గల వారెవరయినా పూజ్యులే.

దివ్యజ్ఞానాన్ని పొందిన తర్వాత బుద్ధుని మనస్సు అత్యంత ప్రశాంతమయింది. అప్పుడతడిలా అన్నాడు. " నేను దేహ రూపమైన గృహాన్ని కల్పించే వాసనకు వశుడనై భూమిపై ఎన్నో జన్మలెత్తుతూ వచ్చాను. తిరిగి, తిరిగి జన్మించడం యెంతో విషాదకరమైన విషయం. ఓ గృహ నిర్మాణ కారిణీ! వాసనా దేవీ! ఇప్పటికి నేను నిన్ను తెల్సుకున్నాను. ఇక మళ్లానీవు గృహాన్ని నిర్మించలేవు. నీ గృహ స్తంభాలన్నిటినీ నేను పడగొట్ట గలిగాను. నామనస్సు నేడు అన్నివాసనలనూ పూర్తిగా నాశనం చేసింది."

నాటినుంచీ అతడు సకలజీవుల దుఃఖాన్నీ పోగొట్టడానికై ప్రపంచంలో దివ్యజ్ఞాన ప్రబోధం చేసే విషయమై ఆలోచించ సాగాడు.

## ధర్మ ప్రచారం

బుద్ధుడు తన మతాన్ని ముందుగా కొంతమంది అర్హులకు బోధించడం ఉత్తమమని భావించాడు. ఏమంటే సామాన్య జనులు తేలికగా యీ ధర్మాన్ని గుర్తించలేరు. అప్పుడతనికి తన మొదటి గురువు లిద్దరూ గుర్తువచ్చారు. అయితే వారప్పుడే గతించారు. వారు సజీవులైవుంటే తనమతం వారిద్వారా బాగా ప్రచార మయ్యేదని అతడు ఉద్దేశపడ్డాడు. తర్వాత యిదివరలో తన వద్దనున్న అయిదుగురు శిష్యులు జ్ఞప్తికి వచ్చారు. వారిపేర్లు

కౌండిన్యుడు, భద్రజితుడు, బాష్పుడు, మహానాముడు, అశ్వ జితుడు. వారు వారణాసిలో వుండడంవల్ల బుద్ధుడక్కడకు ప్రయాణ మయ్యాడు. దారిలో అతనికి ఉపకాముడు అనే తత్వజ్ఞాని కనబడ్డాడు. వారణాసి యెందుకు పోవుచున్నావని అతడు బుద్ధుని ప్రశ్నించగా అక్కడ ధర్మచక్ర ప్రవర్తన కావిస్తానని జవాబు చెప్పాడు. కొద్దిరోజుల అనంతరం బుద్ధుడు వారణాసి చేరుకున్నాడు. ఆనగర సమీపంలో 'మృగదావం' అనే రమణీయమైన ఆశ్రమమున్నది. బుద్ధుని శిష్యు లయిదు గురూ అక్కడే వున్నారు. బుద్ధుడు ఆ ఆశ్రమ ప్రాంగణంలోకి వెళ్ళగానే వారతనిని గుర్తించి అతడు యోగభ్రష్టుడై పోయాడనీ, లక్ష్యసిద్ధిని పొందలేదనీ, అతడిక్కడకు రావడం అనవసరమనీ, అతనికి అభివాదం చేయరాదనీ అనుకున్నారు. వారలా అనుకుంటూ వుండగానే బుద్ధుడు వారిని సమీపిం చాడు. మొదట్లో అతనిని గురించి యేమేమో అనుకున్న అయిదుగురూ బుద్ధుడు దగ్గరకు రాగానే తేజోయుతమైన అతని రూపాన్నిచూసి ఆశ్చర్యచకితులై వందనమాచరించి ఉచి తాసనంపై కూర్చోబెట్టారు. అప్పటినుంచీ బుద్ధుడు వారితో కలసి నూతనధర్మ ప్రచార కార్యక్రమాన్ని యోచించ నారంభించాడు. ఆ అయిదుగురు శిష్యులూ విద్యావంతులైనా ప్రకృతితత్వం తెలియనివారు కావడంవల్ల భ్రాంతి మార్గంలో పోతూ వచ్చారు. కనక వారు బుద్ధుని యెన్నోవిధాలైన ప్రశ్నలు వేయసాగారు. బుద్ధుడు వాటికన్నిటికీ సరియైన

సమాధానాలిచ్చి వారి సందేహాలు పోగొట్టాడు. అతడు వారితో యిలా చెప్పాడు. "మీరు గృహస్థ ధర్మాన్ని పరిత్యజించారు. అయితే అదిచాలదు. మీరింకా మరో రెండు విషయాలు వదిలిపెట్టాలి. మొదటిది ఇంద్రియ జనితమైన భోగసుఖం, రెండవది అనర్థదాయకమైన శరీర క్లేశం, విలాస. వైరాగ్యాలూ, అతిభోజన, నిరశనాలూ, విడిచిపెట్టాలి. ఈ రెండు మార్గాలూ కూడా భ్రాంతి జనకాలే. నేను మధ్యమ మార్గాన్ని అవలంబించాను. దానివల్లనే లక్ష్యసిద్ధిని పొంద గలిగాను నేను నేను జ్ఞాన శక్తివంతుడనయ్యాను. వేదన, తృష్ణ నా మనస్సును చలింపచేయలేవు. మీరు కూడా యీ మధ్యమ మార్గాన్ని అనుసరించండి. జ్ఞానోదయం కలిగి తీరు తుంది. సమ్యక్సంకల్పమూ, సమ్యగ్వాక్కు, సమ్యగ్దృష్టి, సమ్యగ్ధారణం, సమ్యగ్వ్యాయామం, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధి అనే ఎనిమిది మార్గాలనూ అవలంబించండి. అప్పుడు మీకు ధర్మజీవితం అలవడుతుంది. జనన, జరా, మరణాలకు అతీతులవుతారు. నేను మీకు ఎనిమిది మార్గాలు సూచించానుకదా! ఇప్పుడు నాలుగు విధాలైన మహాసత్య వృత్తాంతాన్ని తెలియచేస్తాను. విశ్వమంతా దుఃఖమయమనడం మొదటిసత్యం. సర్వజీవుల జీవితమూ దుఃఖసమంచితం కావించ బడినదనడం రెండవ సత్యం. ఈ దుఃఖరాసులు తొలగించ బడతాయన్నది మూడవ సత్యం. దుఃఖ నివారణకు విశేషోపాయాలున్నాయన్నది నాలుగవ సత్యం.

నీటి వివరమేమంటే, మానవుడు తృష్ణచే ప్రేరేపించబడి భోగతృప్తి కోసమై ప్రయత్నిస్తాడు. అందువల్ల అతని మనస్సు యెప్పుడూ ఉద్విగ్నమై వుంటుంది. చంచలంగా వుంటుంది. ఈ దుఃఖాలన్నిటినీ రూపుమాపాలి, అంటే తృష్ణను దూరంచేయాలి. అప్పుడు మనస్సు ప్రశాంతమై, నిర్వికారమై, సుఖ, దుఃఖాలకు తావియక నిర్మలమైన నీటివలె వుంటుంది.

నాకు యీ సత్యాలన్నీ శాస్త్రాలవల్ల లభించలేదు. గురూపదేశంవల్ల తెలియలేదు. సహజ జ్ఞానంవల్లనూ, స్వాభావిక విమర్శనాశక్తివల్లనూ నాకీ జ్ఞానోదయమైంది. దానివల్లనే నేను తత్వరహస్యాలన్నీ తెల్సుకున్నాను. ఇక నా మనస్సులో యేవిధమైన భ్రాంతికీ తావులేదు.”

బుద్ధుడు చెప్పిన పైమాటలా అయిదుగురికీ అమృతప్రాయంగా తోచాయి. వెంటనే వారు ధర్మదీక్షను గైకొనడానికి సంసిద్ధులయ్యారు. బుద్ధుడు వారికి దీక్షను ప్రసాదించాడు. దానితో కాశీనగరాన బౌద్ధధర్మ విజయ దుందుభులు మ్రోగాయి.

తర్వాతకూడా ధర్మప్రచారం నిమిత్తమై బుద్ధుడు కొంతకాలం పాటు అక్కడే వున్నాడు. ఆ సమయంలో ‘యశు’ డనే ధనికవర్తకుడు బౌద్ధ ధర్మాన్ని అవలంబించాడు. వాని బంధువులు పెక్కుమందికూడా ఆమార్గాన్ని అనుసరించారు. పిమ్మట బుద్ధుడు ఉరువిల్వాం, రాజగృహం, కపిలవస్తు, శ్రావస్తి, వైశాలి మొదలైన అన్ని ప్రాంతాలలోనూ తిరిగి నూతన

ధర్మాన్ని ప్రచారం చేశాడు. ఈ ప్రచార వృత్తాంతాన్ని తెల్సుకునేముందు అసలు ప్రచార విషయాలు తెల్సుకోనడం అత్యావసరం కనక బౌద్ధధర్మశిక్షణ, దీక్షల విధానం యిక్కడ వివరించబడింది.

బుద్ధుడు దివ్యజ్ఞానాన్ని పొందడానికి పూర్వం దేశంలో ఎన్నో మత ధర్మాలు వ్యాపించివున్నాయి అయితే అవన్నీ కర్మ ప్రధానంగా గలవి ధర్మ సూత్రాల తారతమ్యాన్ని గ్రహించాలంటే కర్మను విభజించడం ముఖ్యం. అందువల్ల అన్నికర్మలూ మతానుసారంగా మూడువిధాల విభజించబడ్డాయి. ఒకటి ప్రవృత్తి మూలమయిన కర్మ, రెండవది నివృత్తి మూలమైన కర్మ, మూడు మిశ్రమ కర్మ. కామం, లేక వాసన, లేక తృష్ణ వీటి తృప్తికోసమై చేసే ప్రయత్నం లేక చేష్ట ప్రవృత్తిమూలమైన కర్మ. కష్టసుఖాలను విడనాడడం శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదింద్రియ జనిత సుఖాలను అనుసరించడం దీని లక్షణంగా పేర్కొనబడింది. పోతే సంయమం, వైరాగ్యం చిత్తవృత్తుల నరికట్టి జీవితాన్ని వెళ్ళబుచ్చడానికి ప్రయాసపడడం నివృత్తిమూలమైన కర్మ. ఇక మానవులలో పశుభావ ప్రవృత్తులూ, దైవభావ సంయుక్తులూ కూడా వున్నారు. వీరికి కొన్ని మంచివృత్తులూ, మరికొన్ని చెడ్డవృత్తులూ వుంటాయి. ఏవృత్తుల ప్రేరణచే కార్యాలుచేస్తే అమంగళం సిద్ధిస్తుందో ఆయావృత్తులను విసర్జించడం, వేటివల్ల శుభాలు చేకూరగలవో వాటిని

నిర్వర్తించడం ప్రవృత్తి, నివృత్తి మూలమైన కర్మ అన్న మాట. క్రోధం, లోభం మొదలైన వృత్తులు ప్రేరేపించే పనులు చేయడంవల్ల అమంగళం ఏకురవుతుంది కనక వాటిని విడనాడాలి. దయ, క్షమ మొదలైన వృత్తులు నిర్దేశించే కార్యాలు చేయడంవల్ల శుభాలు కలుగుతాయి. కనక వాటిని ఆచరించాలి.

మన కథానాయకుడైన బుద్ధుని మతధర్మం నివృత్తి ప్రధానంగా కలది. మానవధర్మ సంస్థాపనాచార్యుడైన 'మనవు' కూడా నివృత్తి మూలమైన ధర్మాన్నే ప్రశంసించాడు. బుద్ధుడు జ్ఞానోదయంపొంది దుఃఖ కారణాన్నీ, దాని నివారణోపాయాన్నీ తెల్సుకున్నట్లు పైన వివరించబడిందిగదా! అయితే యీ తత్వాలు రెండింటినీ గ్రహించడానికి పూర్వంనుంచీ అతడు పూర్వజన్మ, పరజన్మ, కర్మఫలం అనే మూడింటినీ విశ్వసిస్తూనే వున్నాడు. జీవుల పునర్జన్మకు కర్మయే కారణమని అతని నమ్మకం. జన్మగ్రహణంవల్ల సుఖ దుఃఖానుభవాలు కలుగుతాయి. జన్మరాహిత్యం కావించుకొనడమే బౌద్ధధర్మ ప్రధానాశయం. మంచికర్మలను ఆచరించే సందర్భంలో బుద్ధుడు కొన్ని నియమాలు ఏర్పాటు చేశాడు. అవన్నీ సంయమమే ప్రధానంగా కలవి. నిత్యానుసరణీయాలయిన యీ నియమాలను అభ్యసిస్తూ జీవయాత్రను సాగించడంవల్ల ఇంద్రియాలు నిగ్రహించబడతాయి. కర్మ పరిశుద్ధమవుతుంది. చిత్తవృత్తి నిరుద్ధమవుతుంది. మనస్సు నిర్మలమవుతుంది. తత్వదర్శనం కలుగుతుంది. క్రమంగా మానవునకు కర్మ

ప్రవృత్తి సన్నగిల్లుతుంది. తర్వాత దేహం శుష్కించి మరణం సంభవిస్తుంది. ఇక పునర్జన్మ వుండదు.

బౌద్ధధర్మ శిక్షణ యిలాగే వుంటుంది. ఇందులో యెన్నో సూక్ష్మాతి సూక్ష్మమైన తత్వ విషయాలు యిమిడి వుంటాయి. బుద్ధుని శిక్షణను అనుసరించాలంటే దీక్షను గ్రహించాలి. మొదట్లో కొన్ని సంవత్సరాలవరకూ దీక్ష విషయమైన విశేష నియమాలేవీ ఏర్పడలేదు. అవసరాన్ని బట్టి అప్పుడప్పుడు యివి ఏర్పాటు చేయబడుతూ వచ్చాయి. బౌద్ధధర్మంలో ధర్మజీవనయాత్రకు రెండు ప్రధానానుష్ఠేయాలున్నాయి. వాటిలో మొదటిది ప్రవ్రజ్యా స్వీకారం. రెండవది ఉపసంపదా స్వీకారం. వీటిని గురించి కొంచెం తెల్సుకోనడం అవసరం. ఎవరైతే బౌద్ధధర్మంపై విశ్వాసాన్ని కలిగి ఆ మతాన్ని స్వీకరించ దలుస్తాడో అతడు మొదట పరివ్రాజకాశ్రమాన్ని స్వీకరించాలి. దానినిమిత్తం బౌద్ధాచార్యుని సన్నిధిలో ఉపదేశం పొందాలి. తర్వాత ఆచార్యునకు పీతవర్ణ వస్త్రాలు తెచ్చి "సంసారంలో గల సకల దుఃఖాలను నివారించడానికై నేను ప్రవ్రజ్యాగ్రహణం గావించడానికి నిశ్చయించుకున్నాను. దయతో యీ మూడు కాషాయి వస్త్రాలూ గ్రహించండి" అని మూడుసార్లు ప్రార్థించాలి. అంతట ఆచార్యు డావస్త్రాలు గ్రహిస్తాడు. తదుపరి దీక్షార్థి మళ్లా "మహాశయా! సంసార సకలదుఃఖ నివారణకూ, నిర్వాణ లాభంకొరకూ నేనీ ఆశ్రమాన్ని స్వీకరిస్తాను.

దయవుంచి నాకు కాషాయివస్త్రాలు ప్రసాదించండి" అని ముమ్మారు కోరుకోవాలి. అప్పుడు ఆచార్యుడతనికి యీ వస్త్రాలు యిచ్చివేస్తాడు. వాటిలో ఒకటి కౌపీనంగానూ, మరొకటి కట్టుపుట్టంగానూ, యింకొకటి ఉత్తరీయంగానూ ఉపయోగించమంటాడు. దీక్షార్థి ఆప్రకారం వస్త్రాలు ధరించి "స్వామీ! నేను సంసారంలోని సర్వ దుఃఖాలనూ నివారించుకొనడానికీ, నిర్వాణలాభాన్ని పొందడానికీ ప్రవ్రజ్యాశ్రమాన్ని స్వీకరించాను" అని మూడుసార్లు ప్రమాణం చేస్తాడు. ఆపైన అతడు త్రిశరణ, దశకుశల ధర్మ ప్రార్థన లుపదేశించ వలసిందని ఆచార్యుని మూడుపర్యాయాలు కోరగా ఆచార్యుడీ దిగువ మంత్రాల నుపదేశిస్తాడు.

"నేను బుద్ధుని శరణు చొచ్చితిని"

"నేను ధర్మము శరణు చొచ్చితిని"

"నేను సంఘము శరణు జొచ్చితిని"

ఈ త్రిశరణ మంత్రం మూడుసార్లు ఉచ్చరించిన తర్వాత యీ క్రింద పేర్కొనబడిన దశకుల ప్రతిజ్ఞలు చేయబడతాయి.

1. నేను ప్రాణిహింస చేయను.
2. నేను పరద్రవ్యము నపహరించను.
3. నేను వ్యభిచారము చేయను.
4. నేను అసత్య మాడను.
5. నేను విలాసార్థమైననూ మద్యపానము చేయను.

6. నేను అపరాహ్ణమున భుజించను.
7. నేను నృత్య, గీతాది దర్శన శ్రవణాలను గావించను.
8. నేను విలాసానికైనా పరిమళ ద్రవ్యాలను వాడను.
9. నేను ఉన్నతాసనాన్నీ, ఉన్నత శయ్యనూ స్వీకరించను.
10. నేను స్వర్ణ రేప్యముల ప్రతిగ్రహించను.

ఈ పది ప్రశ్నలనూ దీక్షార్థి మూడుసార్లు ఉచ్చరించాలి. అపుడు ఆచార్యుడతనితో త్రిశరణ సహితమైన దశ కుశల ధర్మాన్ని ఉత్తమ రూపంలో రక్షించడానికి జాగ్రత్తగా కాలంగడపమని ప్రబోధిస్తాడు. ఈ రీతిగా బౌద్ధధర్మంలో ప్రథమ దీక్ష అయిన ప్రవ్రజ్యానుష్ఠానం ఆచరించబడుతుంది. తదుపరి దీక్షను పొందినవ్యక్తి అన్న, వస్త్ర, శయనాదుల విషయంలో చాలా నియమాలు పాటించాలి. ఈ ఆశ్రమానంతరం ఏవ్యక్తి అయినా అగ్రగామి కాదలిస్తే భిక్షుక సాంప్రదాయాన్ని అనుసరించి 'ఉపసంపదాగ్రహణ' మనే అనుష్ఠానం ఆచరించాలి. ఇందుకు నిశ్చయించుకున్న పక్షంలో మొదట అతడొక భిక్షుకాచార్యుని గురువుగా భావించి శ్రద్ధతో ఆశ్రయించాలి. ఒక భిక్షాపాత్రనూ, మూడు కాషాయి వస్త్రాలనూ సంపాదించుకోవాలి, ఆపైన భిక్షుకసంఘం సమ్ముఖంలో గురువును చేరి ఉపసంపదా దానాన్ని గావించమని కోరుకోవాలి. అంతట గురువాతని విషయంలో యీక్రింది నియమాలను పరిశీలిస్తాడు.

1. స్వాస్థ్య విషయంలో గుష్టము, గండమాల, అప స్మారం మొదలైన రోగాలున్నవా ? (వున్నవారు ఉపసంపదా గ్రహణాని కర్హులుకారు.)

2. వయస్సు యిరవై సంవత్సరాలు దాటినదా? లేదా?

3. తల్లి దండ్రుల అనుమతిని పొందినాడా ?

4 స్త్రీయా ? పురుషుడా ?

5. స్వాధీనుడా ? పరాధీనుడా ? రాజసేవకుడా ?

6. ఋణం లేనివాడా ? కాడా ?

7. భిక్షాపాత్ర కాషాయివస్త్రాలు సంపాదించుకో గలడా,

ఇవన్నీ పరిశీలించిన తర్వాత ఉపసంపదా గ్రహణార్థి తనను 'నాగ' నామంతో పరిచితుడ్ని చేసుకుంటాడు. అలా నాగనామంతో వ్యవహరించుకోనడం తాను సర్వంవతె హింసకుడననీ, పాపాత్ముడననీ తెలుపుకోనడానికే. పిమ్మట అతడా భిక్షుక సంఘానికి నమస్కరించి మూడుసార్లు ఉప సంపద ఆశ్రమాన్ని యాచిస్తాడు. దానికక్కడున్న భిక్షువు లంతా మౌనంద్వారా తమ అంగీకారాన్ని తెలుపుతారు. అంతట గురువు మళ్లా అతనిని కొన్ని ప్రశ్నలువేసి అనుష్టాన మాచరించి ఉపసంపన్నుడయిన అతనితో "నేటినుంచి భిక్షా లబ్ధమైన అన్నాన్ని ఆహారంగానూ, కాషాయాంబరాలను వస్త్రాలుగానూ, వృక్షతలాన్ని నివాసంగానూ, గోమూత్రాన్ని

ఔషధంగానూ ఉపయోగిస్తూ ఆ మరణాంతము వీటిని పాటించాలని చెప్తాడు. మరినాలుగు విషయాలనుకూడా ఆచార్యుడు బోధిస్తాడు. వానిలో అల్ప జీవహింసను నిషేధించే ఉపదేశం కూడా వున్నది. ఈ ఉపదేశం పూర్తికాగానే ఉపసంపన్నుడు మూడు కాషాయి వస్త్రాలను తీసుకుని నాగ మానాన్ని విడిచిపెట్టి ధర్మపాలుడు, ధర్మరక్షితుడు అనే పేర్లు ధరించి బిక్షుక సంఘంలో ప్రవేశిస్తాడు. బుద్ధుని మతధర్మానికి, ధర్మగ్రహణానికీ సంబంధించిన వివరాలు యింతవరకూ చెప్పబడ్డాయి.

కాశీలో బుద్ధుని పూర్వ శిష్యులయిదుగురూ, యశుడనే వర్తకుడూ, వాని బంధువులూ ధర్మదీక్షను అవలంబించిన సంగతి యింతకుముందే చెప్పబడింది. క్రమంగా దీక్షపొందిన వారిసంఖ్య అధికమై యిరవై ఒకరితో బిక్షుకసంఘం నెలకొల్పబడింది. యిట్లు ఏర్పడిన సంఘమునకు బుద్ధుడు బౌద్ధధర్మమును సమగ్రముగా బోధించి, యన్నిదిశలయందుండు జనులకు బాహాటముగా ధర్మమును బోధించుటకై వారిని ధర్మోపదేశకులనుగా నియమించెను. అనంతరం బుద్ధుడు ఉరుబిల్వాం చేరుకున్నాడు. అక్కడ అతడు మొదట విలాసవంతులయిన ధనికుల పుత్రులకు నూతన ధర్మదీక్షను ప్రసాదించాడు. ఆ యువకులందరూ అంతవరకూ భోగలాలస జీవితాలు గడుపుతూ వచ్చారు. వారు అకస్మాత్తుగా యిలా మారిపోవడంతో నగర ప్రజలు ఆశ్చర్యపడ్డారు. వూరంతా యిదొక వింతగా ప్రచారమైంది. బుద్ధునివద్ద యేదో మంత్ర ప్రభావ

మున్నదనీ, అందువల్లనే ధనికుల పుత్రులుకూడా యిలా మారి పోతున్నారనీ చాలామంది చెప్పుకొనసాగారు. ఎక్కడవిన్నా బుద్ధనామమే మారుమ్రోగిపోవడంతో అతని ధర్మరహస్య తత్వాన్ని తెల్సుకోవాలన్న అభిలాషతో జనం తండోప తండాలుగా రాసాగారు బుద్ధుడు వారందరకూ నూతన ధర్మాన్ని వివరించ నారంభించాడు. బుద్ధుని మతంచే ఆకర్షింప బడిన కాశ్యపుడు, గయాకాశ్యపుడు, నదీకాశ్యపుడు అనే ముగ్గురు బ్రాహ్మణులు దీక్షను పొందారు. అంతవరకూ వారు వానప్రస్థాశ్రమంలో వుండడంవల్ల వారికి వందలాది శిష్యు లున్నారు ఆ శిష్యులందరూకూడా బుద్ధుని మతాన్ని స్వీకరిం చారు. దానితో బుద్ధుని ప్రభావం నాలుగుమూలలా వ్యాపించ సాగింది.

కొన్నాళ్ళపాటు ఉరుబిల్వంలో ప్రచారం చేసిన తర్వాత బుద్ధు డక్కడనుంచి బయలుదేరి గయాశీర్ష పర్వత ప్రాంతానికి వెళ్లాడు. కొంతకాలం అక్కడ గడిపి తర్వాత రాజగృహం చేరాడు. అతడచ్చటకు వచ్చాడన్న వార్త తెలియగానే బింబిసారుడు స్వయంగా అతని నివాసానికివెళ్లి దర్శించి అతని శరీర తేజస్సుకూ, నూతన ధర్మవిషయాలకూ ముగ్ధుడై పోయాడు. బుద్ధునిపై కలిగిన అపారభక్తిని వెల్లడించు కొనడానికై ఆ రాజు అతనికి సాష్టాంగ దండప్రమాణంచేసి తనకు నూతన ధర్మదీక్షను ప్రసాదించమని ప్రార్థించాడు. బుద్ధుడు బింబిసారునకు దీక్ష నిచ్చాడు. రాజుతోబాటు అతని

సేవకులుకూడా దీక్ష గైకొన్నారు. తర్వాత రాజు బుద్ధునకూ అతని శిష్యులకూ రాజభవనంలోనే భోజనాది సదుపాయాలు ఏర్పాటు చేశాడు. ఆ ఆతిథ్యాన్ని బుద్ధుడు స్వీకరించాడు.

బింబిసారునితో సహా వందలాది ప్రజలు బుద్ధుని అడుగు జాడలలో నడవడానికి సంసిద్ధులు కావడంవల్ల అమాయకులైన కొందరికి బుద్ధునిపై పట్టరాని కోపంవచ్చింది. అయితే క్రమంగా అది చల్లారిపోయింది.

# స్వస్థల సందర్శనం

బుద్ధుడు కొద్దిరోజులపాటు రాజగృహంలో వుండి తర్వాత తన స్వస్థలమైన కపిలవస్తు నగరానికి బయలుదేరాడు. అతడు నగరానికి సమీపంలోవున్న ఒక ఉద్యానవనంలో శిష్య సమేతంగా బసచేశాడు. ఒకనాడతడు శిష్యులను వెంటబెట్టుకుని రాజధానిలోకి వెళ్లాడు. బుద్ధుడు యిదివరకటి సిద్ధార్థుడు కాడు. ఇతని రూపంవేరు. అతనిరూపం వేరు. కాషాయ వస్త్రాలతో, చేత భిక్షాపాత్రతో అతడు కపిలవస్తులో ప్రవేశించాడు. ఈవార్త వెంటనే శుద్ధోదన మహారాజుకు తెల్సింది. ఆయన తక్షణమే బయలుదేరివచ్చి బుద్ధునీ, అతని శిష్యబృందాన్నీ, తన భవనానికి తీసుకువెళ్లి భోజనాది సదుపాయాలు ఏర్పాటు చేశాడు.

బుద్ధుని చూడగానే శుద్ధోదనునకు కలిగిన ఆనందం వర్ణించ నలవికానిది. కన్నకొడుకు. చిన్నతనంనుంచీ యెంతో ఆప్యాయంగా పెంచాడుతను. అటువంటి కుమారుడు ఏడెనిమిది సంవత్సరాలనుంచి తనకంటికి దూరమై నేడు అకస్మాత్తుగా తిరిగి వచ్చాడంటే ఆ తండ్రి ఆనందానికి అంతువుంటుందా ?

అయితే ఒకసంగతి.

కుమారుని రాకకు ఒకప్రక్క యెంత అపరిమితానం దాన్ని పొందుతున్నాడో, మరొకప్రక్క అంత అపరిమిత దుఃఖాన్నికూడా పొందుతున్నాడా మహారాజు.

కారణం ! పుత్రుని వాలకం. భరించరాని దుఃఖంతో "రాజకుమారుడవై కూడా లజ్జాకరమైన యీ భిక్షుకవృత్తి నెందుకు స్వీకరించావు" అని ప్రశ్నించాడతడు కుమారుడ్ని. 'నేనవలంబించిన నూతన ధర్మానికిది నియమం' అని బుద్ధుని సమాధానం.

సరే. బుద్ధుని ఆగమనంసంగతి తెలియగానే రాజభవనంలో చాలామంది సమావేశమయ్యారు. వారంతా అతనిని చూసి కన్నీరు కార్చారంటే ఆశ్చర్యంలేదు, కొందరతనిని ప్రస్తుతించారు. మరికొందరు విమర్శించారు. వారిలో ఒకవ్యక్తి ప్రక్కవానితో యిలా అన్నాడు. 'సకల జీవులపైనా దయ చూపాలన్నదే బుద్ధుని మతమైతే వృద్ధుడయిన తండ్రిపట్లనూ, శోకాకుల స్వాంతఅయిన భార్యపట్లనూ అతనిదయ

యేమయింది? ఇలా అనేకమంది అనేకవిధాలుగా అనుకున్నారు. ఇంతలో బుద్ధుడు నూతన ధర్మ మార్గాన్ని గురించి ప్రసంగించ నారంభించాడు. అతని దివ్యకాంతి, మధుర కంఠస్వరం అక్కడున్న వారినందరనూ అప్రయత్నంగా ఆకర్షించాయి. అతనికి విరుద్ధంగా యెవరూ మాట్లాడలేకపోయారు. బుద్ధుని నూతన ధర్మంలోగల సత్యం అతని ప్రసంగంవల్లనే అందరకూ తేట తెల్లమయింది.

ఆ సమావేశానికి పురుషులతోబాటు రాజమందిరం లోని స్త్రీలందరూకూడా హాజరయ్యారు. కాని ఒకే ఒక వనిత మాత్రం రాలేదు.

ఎవరామె ?

సిద్ధార్థుని సహధర్మచారిణి-యశోదర. ఆమె రాకపోవ డానికి కారణం ?

ఆగ్రహమా ? కాదు.

అభిమానమా ? అదీకాదు.

ఉచిత సమయంలో తనస్వామి తనకు తప్పక దర్శన మీయగలడన్న సంగతి ఆమెకు తెల్సు.

ఆ ప్రకారమే బుద్ధుడు యశోధర మందిరానికి వెళ్లాడు. అప్పటికామె కటికి నేలపై పడివున్నది. పూర్వపు యశోధరకూ యిప్పటి యశోధరకూ పోలికే లేదు. బుద్ధుడు మందిరానికి వెళ్ల గానే ఆమె లేచింది. తనస్వామిని కళ్లారా దర్శించింది.

కాని ఆమె కన్నీటిచుక్కలు రాల్చలేదు. తన మనో వేదనను వెళ్ళగక్కలేదు. ప్రశాంత చిత్తంతో అతని పాదాలకు నమస్కరించింది. దీని తాత్పర్య మేమిటని కొందరికి సందేహం కలగవచ్చు. యశోధర పతివ్రతా శిరోమణి. పతి మార్గాన అనుసరించడమే ఆమె కర్తవ్యం. బుద్ధుడు ఆమెకుకూడా నూతన ధర్మాన్ని ప్రభోదించాడు. నాటినుంచీ ఆమె ఆబోధనల ప్రకారమే నడచుకోవసాగింది. యశోధరకు ధర్మబోధకాగానే బుద్ధుడు తన నివాసానికి వెళ్ళిపోయాడు. కొద్దిరోజులలో యశోదర తనకుమారుడ్ని బుద్ధునివద్దకు పంపించింది. ఆ బాలుడు తండ్రివద్దకు వచ్చి తండ్రిమార్గాన్నే నడచుకుంటానన్నాడు. వానికి ప్రవ్రజ్యం యీాయబడింది.

## నందునకు దీక్షాప్రసాదం

బుద్ధుడు తన శిష్యులతో కలసి భిక్షార్థమై బయలుదేరి రాజధానిలో ఒక బ్రహ్మాండమైన ప్రాసాదంవద్దకు వెళ్లాడు. గుమ్మం వద్ద నిల్చుని అతడు 'భిక్షాం దేహి' అని కేక పెట్టాడు. సమాధానం లేదు. రెండవసారి 'భిక్షాం దేహి' అన్నాడు. ఎవరి జాడా కానరాలేదు. మూడవసారి కూడా 'భిక్షాం దేహి' అని పిలచాడు. లాభం లేకపోయింది. బుద్ధుడు ఆ గుమ్మందాటి వెళ్లిపోయాడు. తర్వాత కొద్దిసేపటికి ఒకపరిచారిక ప్రాసాదం

పైభాగానికి వెళ్లి తలుపుకొట్టి బుద్ధులవారు బిక్షకోసం వచ్చి వెళ్లిపోయారని చెప్పింది. అంతవరకూ పై ప్రపంచంతో సంబంధంలేకుండా గదిలో శృంగార సముద్రంలో మునిగివున్న భార్యాభర్త లామాటతో కంగారు పడ్డారు.

ఆ దంపతు లెవరో ననుకుంటారేమో? బుద్ధుని సోదరుడైన నందుడూ–నందుని భార్య సుందరి.

పెండ్లిఅయిన నాటినుంచీ అంతవరకూ ఆ దంపతు లెన్నడూ పట్టుమని పదినిమిషాలైనా ఒకరినొకరు విడిచివుండ లేదు. ప్రపంచంతో సంబంధం పెట్టుకోలేదుకూడా. ఇరవై నాలుగు గంటలూ ఆగదియే వారికి స్వర్గం. జీవిత భోగాన్ని అనుభవించడమే వారిపని.

అందుచేతనే బుద్ధుడు బిక్షకువచ్చి ముమ్మారు కేక వేసినా వారికి వినబడలేదు. పరిచారికవెళ్లి చెప్పగానే వారికి ఆందోళన కలిగింది. తన సోదరునికి ఆగ్రహం కలిగివుంటుం దేమోనని నందుడు భయపడ్డాడు. ఎలాగైనా ఒక్కసారి వెళ్లి బుద్ధుని బ్రతిమాలాలని నిశ్చయించుకున్నాడు. కాని ప్రేయసిని విడిచి వెళ్ళడానికి అతనికి కాళ్ళు ఆడడంలేదు. ప్రియుని యెడ బాసి ఒక్క నిమిషమైనా సరే వుండడం సుందరికి యిష్టం లేదు. ఆఖరుకు యేమయితేనేమి సుందరి నుదుటను అప్పుడే పెట్టుకున్న సింధూరతిలకం చెమ్మగిల్లేలోగా వస్తానని ప్రమాణం చేసి బయలుదేరాడు నందుడు. తిన్నగా అన్నగారివద్దకు వెళ్ళి

తనయింటికి బిక్షకు రమ్మని ప్రార్థించాడు. బుద్ధుడు నిరాకరించాడు. కాని నందుడు వెనకకు వెళ్ళిపోకుండా సోదరుని ప్రతిమాల సాగాడు. అప్పుడు బుద్ధుడు నందునకు జీవిత పరమావధిని గురించి వివరంగా బోధించి ధర్మదీక్షను గైకొనమన్నాడు. అయితే యింతలోనే తన వలపులరాణి సుందరి జ్ఞప్తికి వచ్చింది. నందునకు దీక్ష గైకొనడానికి అతనిమనస్సు అంగీకరించలేదు. బుద్ధునితోపాటు అతని శిష్యులుకూడా యెంతోసేపు నందునకు హితబోధ చేశారు. ఆఖరుకు నందుడు దీక్షను గైకోవాలనే సంకల్పానికి వచ్చాడు.

కాని ...... ఒక్కషరతు.

తన ప్రేయసి, యిన్నాళ్ళనుంచీ తలను నమ్ముకున్న యిల్లాలు సుందరిని ఒక్కసారి చూసి, ఆమెతో చెప్పి వస్తానన్నాడతడు. 'అంటే నీకింకా వ్యామోహం పోలేదన్నమాట?' బుద్ధుడూ అతని శిష్యులూ ప్రశ్నించారు. జీవితం క్షణభంగురమనీ, యీ సుఖాలన్నీ తుచ్ఛ సుఖాలనీ వారు కడసారి నందునకు బోధించారు. మనస్ఫూర్తిగా యిష్టంలేకుండానే నందుడు దీక్షా స్వీకారానికి తలవూపాడు. సుందరికి తెలియకుండానే నందునకు దీక్ష ప్రసాదించబడింది. తర్వాత ఒక శిష్యుడు సుందరితో చెప్పడానికి వెళ్లాడు.

అదేమి చిత్రమోగాని అప్పటికే సుందరికూడా తన ఆభరణాలనూ, విలువైన వస్త్రాలనూ తీసివేసి తాను కూడా

దీక్ష గైకొనడానికి సిద్ధంగా వున్నది. బుద్ధుని శిష్యు డదిచూసి ఆశ్చర్యపడ్డాడు. ఆమెకూడా దీక్షను స్వీకరించింది.

అంతవరకూ జీవితం కష్టాలంటే యేమిటో తెలియకుండా, కనీసం యెండ కన్నయినా యెరగని భోగలాలసుల్ని భిక్షువులుగా మార్చగలిగాడంటే బుద్ధుని మహాత్యం యెటువంటిదో అతని బోధనాశక్తిలో యెంత పటుత్వమున్నదో తేలికగా గ్రహించవచ్చు. నిత్యమూ కష్టాల ననుభవిస్తున్న సామాన్యులు యిటువంటి ఉద్యమంలో చేరారంటే అర్థం చేసుకోవచ్చు. కాని భోగభాగ్యాలకు కొరతలేని నందునివంటివారు కొన్ని వందలమంది ధర్మదీక్షను స్వీకరించారంటే అది నిశ్చయంగా బుద్ధుని ప్రభావమే.

## విజయ యాత్ర

కపిల వస్తునగరంలో కొంతకాలం వున్న తర్వాత బుద్ధుడు 'శ్రావస్తి' నగరం వెళ్ళాడు. అక్కడ చాలామందికి నూతన ధర్మదీక్షను ప్రసాదించాడు. ఆ నగరాన్ని పాలిస్తున్న అనాథపిండదుడు దానశీలుడు, సద్గుణ సంపన్నుడు. యెవరు వచ్చినా అన్నదానం చేయాలని దీక్ష పట్టినవాడు. అందుకే అతనికి అనాథపిండదుడని పేరు వచ్చింది. అతని అసలు పేరు సుదత్తుడు. ఆ రాజు బుద్ధుని దర్శించి, అతని మతసిద్ధాంతాలవల్ల ఆకర్షించబడి, బౌద్ధ ధర్మ ప్రచారానికై లెక్కలేనంత ధనం ఖర్చు పెట్టాడు.

శ్రావస్తిలో ప్రచార కార్యక్రమం పూర్తికాగానే బుద్ధుడు మళ్లా రాజగృహం వెళ్లాడు అక్కడనుంచి వైశాలి వెళ్ళగా తన తండ్రికి చాలా జబ్బుగా నున్నదని తెల్సింది. అప్పటికి శుద్ధోదనుని వయస్సు తొంభై యేడు సంవత్సరాలు కావడంవల్ల యిక అవసానకాల మాసన్నమైనదని గుర్తించి బుద్ధుడు కపిలవస్తునగరం చేరాడు. బుద్ధుడు సర్వసంగ పరిత్యాగి అయినా పుత్ర ధర్మాన్ని మాత్రం మర్చి పోలేదు. ఆఖరు సారిగా కుమారుని చూసుకుని శుద్ధోదనుడు కళ్ళు మూశాడు? బుద్ధుడు యథావిధిగా తండ్రి అంత్య క్రియలు జరిపాడు.

శుద్ధోదనుడు గతించడంతో రాజ్యానికి నేత కరువై పోయాడు. రాజపరివారమంతా విచారంతో కృంగిపోయింది. బుద్ధుడు వారిని వూరడించాడు. ఆ సమయంలో రాజపరివారంలో పెక్కుమంది బౌద్ధధర్మాన్ని స్వీకరించారు. వృద్ధరాణి అయిన ప్రజావతికూడా యశోధరతోబాటు బుద్ధుని అనుసరించింది.

కపిలవస్తును విడిచిన తర్వాత బుద్ధుడు కౌశాంబీ నగరం వెళ్లాడు. తిరిగి అచ్చటనుండీ రాజగృహం చేరాడు. అప్పుడు బింబిసారుని రాణిఅయిన క్షేమ బుద్ధునివద్ద దీక్ష పొందింది. ఇలా స్త్రీలతో సహా పెక్కుమంది చేరడంతో కొత్తగా ఒక భిక్షుక సాంప్రదాయం యేర్పడింది. బౌద్ధ ధర్మ ప్రచారంలో అందరూ తోడ్పడ్డారు.

బుద్ధునకు ముప్ఫయి అయిదవఏట దివ్యజ్ఞానం కలిగింది. తర్వాత అతడు నలభైఅయిదు సంవత్సరాలు జీవించాడు. ఈ నలభైఅయిదు సంవత్సరాలలోనూ అతనికి వేలాది ప్రజలు శిష్యులయ్యారు. రాజులూ, రాజపత్నులూ, ధనికులూ, పండితులూ మొదలైన వారెందరోమంది అతని శరణు చొచ్చారు. సాధారణ ప్రజలలో చాలామంద పుణ్య పిపాసచేతనూ, మరికొందరు అనుకరణ ప్రభావంవల్లనూ బౌద్ధులయ్యారు. దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ బౌద్ధ విహారాలూ, ఆరామాలూ, చైత్యాలూ నిర్మించబడ్డాయి. వైదిక కర్మ చాలావరకూ క్షీణించింది. యజ్ఞ యాగాదులకు బదులుగా పశుహత్యలు ప్రారంభం కాజొచ్చాయి. ఉపవీత ధారులూ, విశద వస్త్రశోభితులూ అయిన బ్రాహ్మణుల సంఖ్య తగ్గి బిక్ష పాత్రాంచిత హస్తులూ, కాషాయి వస్త్రధారులూ అయిన బిక్షువుల సంఖ్య పెరగనారంభించింది. బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణ భేదానికి మారుగా శ్వేత, పీత కాషాయివస్త్ర విచిత్రం కానరావడం మొదలయింది.

ఇదంతా చూసిన కొందరు సనాతులు బుద్ధునిపై చాలా ఆగ్రహించారు. అతడు హీన చరిత్రుడని ప్రచారం లేవదీశారు. అయితే వారి యీర్ష్యా పూరిత యత్నాలన్నీ కాల గర్భంలో కలసిపోయాయి. ప్రజాకోటి బుద్ధుని అడుగుజాడలలో నిలచి దుఃఖం, కష్టం, పాపం, తాపం, హింస, ద్వేషం మొద

లైనవాటితో తీవ్ర యుద్ధం కొనసాగించ నారంభించింది. బుద్ధుని యాత్ర విజయవంతమైంది. అతడు ప్రజా బాహుల్యంచే అవతార పురుషుడుగా భావించబడ్డాడు.

## ప్రేమదానం

బుద్ధుని కాలంలో భారతావని యొక్క సాంఘిక స్థితిగతులు యెలా వుండేవో పూర్తిగా తెలియదు. అయితే అప్పుడు బ్రాహ్మణ ధర్మ ప్రచారమున్నది, కనక వర్ణభేదాలుండి వుంటాయనడానికి సందేహం లేదు. అగ్రజాతులు తక్కువ జాతిని నీచంగా చూడడం మామూలు ఆచారమేకదా! శూద్రులకు ధర్మాధి కారంలేదు. దేవాలయాలలో ప్రవేశించే అర్హతలేదు. ఇలా యెన్నో అత్యాచారాలు అమలులో వుండేవి. వీటికి తోడుగా పాపులూ, దుర్వర్తనలూ అయిన వారికి విధించబడే శిక్షలు కూడా చాలా ఘోరంగా వుండేవి. వారు సంఘంనుంచి పూర్తిగా వెలివేయబడేవారు. ఈ చర్యలు అందరిపైనా ఒకే రకంగా అమలు జరిగితే మన సమాజం యేనాడో బాగుపడి వుండేది. కాని అందులో ధనికుల కొకధర్మం–దరిద్రుల కొక ధర్మం.

బుద్ధుడు యీ విషయాలన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించాడు. పరిశీలించడమే కాదు. ప్రతీకారాన్ని సిద్ధపరచాడు కూడా. బుద్ధుని నూతన ధర్మంలో భిక్షువులు పరదత్తమైన

భిక్షాన్నాన్నే తినాలని నియమం వుండడంవల్ల అగ్రజాతికీ, తక్కువజాతికీ మధ్యగల భేదాలు తొలగిపోసాగాయి. స్వయంగా బుద్ధుడు భిక్షాటనకు వెళ్ళి ఆ ఆహారాన్ని గ్రహించడమే గాకుండా తన ధర్మాన్ని స్వీకరించిన ధనికులూ, పండితులూ, దీనులూ, దరిద్రులూ మొదలైన వారందరిచేతనూ యీ నియమాన్ని విధిగా అమలు జరిపించడంవల్ల ఒకరిపై మరొకరికి అసహ్యాలకు బదులు అనురాగం యేర్పడింది.

పోతే యజ్ఞ యాగాదులకు మారుగా పశుహత్యలు ప్రారంభమయ్యాయని యిదివరలో ఉదహరించ బడింది. బుద్ధుడు తన శక్తినంతనూ వినియోగించి అమృత ప్రాయమైన తన ప్రబోధంద్వారా చాలావరకూ యీ దురాచారాన్ని అరికట్టాడు. ఇక పాపులూ, దుర్వర్తనులూ అయిన వారికతడు గావించిన ప్రేమదానం యీ క్రింద ఉదహరణలవల్ల తెలియ గలదు.

అది శరత్కాలం. శుక్లపక్షం. ఆకాశంపై ఒక్క మేఘమైనా లేదు. చంద్రుడు తన చల్లని కిరణాలను వెదజల్లుతున్నాడు. మందంగా శీతల వాయువు వీస్తున్నది. రాజకార్యాలన్నీ పూర్తిచేసుకుని మగధరాజు యజాతశత్రువు తన ప్రాసాదంబయట విహరిస్తున్నాడు. ఆ జ్యోత్స్న పులకిత యామిని శోభను గాంచడంతోనే అతడు హృదయాగ్ని జ్వాలనూ, సంతాపాన్నీ పోగొట్టుకోవాలని ఆశపడ్డాడు.

అప్పటికి కొద్దికాలం క్రిందటనే అతడు తండ్రి అయిన బింబిసారుని హత్యచేసి సింహాసనాన్ని ఆక్రమించాడు. తర్వాత అతడు శాంతికోసమై యెంతోమంది దార్శనిక పండితులనూ, ధర్మాచార్యులనూ ఆశ్రయించాడు. లాభం లేకపోయింది. ఆవేదనతో అతడలా తిరుగుతున్నాడు. అప్పుడక్కడ మంత్రి పుంగవులు కూడావున్నారు. రాజవైద్యుడున్నాడు. శరీర వ్యాధిని వైద్యుడు నివారించగలడుగాని మనోవ్యాధికి మందెక్కడ తేగలడు? అయితే అతడే రాజుకొక హితవు చెప్పాడు. అది బుద్ధుని శరణు వేడవలసిందన్న హితవు. వెంటనే అజాతశత్రువు వైద్యుని వెంటబెట్టుకుని రథంపై ఆ నగర ప్రాంతంలోనే వున్న బుద్ధునివద్దకు వెళ్లి సాష్టాంగ ప్రమాణం చేశాడు. తర్వాత బుద్ధుడు అతని వృత్తాంతాన్ని పూర్తిగా తెల్సుకుని తన ధర్మసందేశాన్ని అతని కందచేశాడు. రాజు ఆ సందేశంచేత పూర్తిగా ఆకర్షించబడి వెంటనే "నేను పాపిని, పితృహంతకుడ్ని. తండ్రిని హత్యచేసిన పాపంతో నా జీవితం కళంకమయమై పోయింది. ఇక దానికి ప్రాయశ్చిత్తం లేదు. దయామయా! నేను మిమ్మల్నే శరణు చొచ్చాను. దారి చూపండి" అని ప్రార్థించాడు. అంతట బుద్ధుడతనితో "రాజా! నీవు పాప వాసనా వశంవల్ల నీతండ్రిని హత్య చేశావు. ఇప్పుడు నీవు దానిని తెల్సుకుని పశ్చాత్తాపానికి వచ్చావు. ఇక నీవు ధర్మాన్ని ఆశ్రయిస్తే నీకేవిపత్తూ రాదు. నూతనధర్మాన్ని స్వీకరించు." ఈ మాటలు వినగానే రాజు

బౌద్ధధర్మాన్ని అవలంబించి ఆచరణలో పెట్టాడు. అతనికీర్తి శాశ్వతంగా నిలిచిపోయింది.

బుద్ధుడు తన ధర్మ ప్రచార సందర్భంలో శిష్యసమేతుడై నానాప్రాంతాలు తిరుగుతూ వైశాలీ నగరం చేరగానే అక్కడ ఆమ్రకావనంలో బసచేశాడు. ఈవార్త వెంటనే నగర ప్రజలందరకూ తెల్సిపోయింది. అంతకుపూర్వమే బుద్ధుని మహాత్యం దేశమంతటా వెల్లడి కావడంవల్ల ఆ మహానుభావుని దర్శించాలన్న కుతూహలంతో జనం గుంపులు గుంపులుగా అక్కడకు రాసాగారు. పండితులు తమ పాండిత్య ప్రకర్షను ప్రదర్శించడానికీ, ధర్మ జిజ్ఞాసువులు, పుణ్య విషయాలు తెల్సుకొనడానికీ, రోగులు తమ రోగనివారణకూ, ధనికులు కీర్తి పొందడానికీ, సంతతి లేనివారు సంతానాన్ని కోరడానికీ, శోకచిత్తులు మనశ్శాంతిని పొందడానికీ, పాపులు తరించడానికీ రావడం మొదలుపెట్టారు. వారంతా తమ తమ కోరికలను బుద్ధునకు విన్నవించుకున్నారు. బుద్ధుడూ, అతని శిష్యులూ వారికి ఉచితమైన సదుపదేశాలు గావించి తృప్తిపరచారు. నగరంలోని ధనవంతులు బుద్ధునకూ, అతని శిష్యులకూ ఆతిధ్యమిచ్చారు. వరసగా కొన్నాళ్ళపాటు ప్రజలు ఎడతెరపి లేకుండా ఆ వనానికి రావడం జరిగింది. వారిలో ఒకనాడొక వనిత అపరిమితావేదనతో బుద్ధుని దర్శనానికి వెళ్ళింది. ఆమె సౌందర్యవతియే అయినా మాసిన వస్త్రాలు కట్టుకున్నది. యేవిధమైన ఆభరణాలూ లేవు. ఆమె జనసమూహంలోకి

వెళ్లగానే 'ఎవరీవనిత?' అని గుసగుసలు ప్రారంభమయ్యాయి. సరాసరి బుద్ధుని సమీపించింది. అదిచూసి అక్కడున్న వారంతా ఆమెను నిందించారు. కారణం? ఆమె వెలకాంత. ఆ నగరవాసులలో పెక్కుమంది యెప్పుడో ఒకప్పుడు ఆమె స్నేహంకోసం తాపత్రయ పడ్డవారే. అయినా వారామెను అసహ్యించుకోసాగారు. అవన్నీ వినిపించుకోనకుండా ఆ వనిత బుద్ధునితో తన పతిత జీవితాన్ని గురించి వివరించి అతనిని శరణుచొచ్చింది. కరుణామయుడైన బుద్ధుడామెకు అభయమిచ్చాడు. ధర్మాన్ని బోధించాడు. శిష్యసమేతంగా ఆమె ఆతిథ్యాన్ని స్వీకరించాడు.

ఇంకొకసారి బుద్ధుడు 'పాలోయ' అనే గ్రామంవెళ్ళి శిష్యులతోసహా చుందుడనే ఒక కర్మకారుని మామిడితోటలో బసఏర్పాటు చేసుకున్నాడు. చుందుడందుకు అపరిమితానంద భరితుడై బుద్ధునీ, అతని శిష్యులనూ తన గృహానికి విందుకు ఆహ్వానించాడు. వారా ఆతిథ్యానికి అంగీకరించారు చుందుడు వి౦దులో వరాహ మాంసంతో వండిన పదార్థాన్నికూడా వడ్డించాడు. బుద్ధునకాసంగతి భోజనసమయంలో తెల్సింది. అతడు మాంసాన్ని ముట్టడు. అయితే అప్పుడు ఆసంగతి తెలియచేస్తే భక్తుడయిన చుందుడు బాధపడతాడని భావించి ఆ ఆహారాన్ని భుజించాడు. శిష్యులుమాత్రం దానిని విడిచిపెట్టారు. మాంసాహారం తినడంవల్ల బుద్ధుని ఆరోగ్యం చెడిపోయింది. రక్తగ్రహణివ్యాధి అంకురించింది.

## నిర్యాణం

అక్కడనుంచి వ్యాధితోనే బుద్ధుడు కుశీనగరం వెళ్లాడు. ఆయన అవతారం చాలించిన దాపూరులోనే.

ఒకనాడతడు సమాధి నిమగ్నుడై చాలా సేపటివరకూ మామూలు స్థితికి రాలేదు. శిష్యులందరూ అతనికి దగ్గరగా కూర్చుని ఆతురతతో చూడసాగారు. ఇదివరకెన్నడూ లేనంత కాంతి అతనిముఖంలో వారికి గోచరించింది. విశ్వమందున్న అనంత శివ సుందర సత్య భావాలను ఆతడంతస్థం గావించుకొనడంవల్ల ముఖంలో దివ్యజ్యోతి ప్రకాశిస్తున్నదని వారు తెల్సుకున్నారు. కొంతసేపటికి బుద్ధుడు యథాస్థితికి వచ్చి తనకు తుదిఘడియలు ఆసన్న మవుతున్నాయని గ్రహించాడు. కాగా ఈ మహనీయుడు తన యవసాన కాలమందు కూడా సుభద్రుడను నొక సన్యాసిని బిల్చి వానికి అష్టాంగ మార్గమును బోధించి ధన్యుని జేసెను. మరణించు సమయమందు ఆయన తన శిష్యులతో “ భిక్షువులారా ! పదార్థ సంయోగ జనితములైన యీ శరీరములకు వియోగము తప్పదు. ధర్మకాయ మొకటియె శాశ్వతమైనది. జ్ఞానమును వెదకి స్వయంకృషివల్ల మోక్షమును పొందుడు. మీరు సత్యాన్ని విస్మరించకండి. మీకు నేనిచ్చే అంత్యోపదేశ మిదియే ” అని చెప్పి తిరిగి బుద్ధుడు సమాధి స్థితుడయ్యాడు. అంతే మళ్లా కళ్ళు తెరవలేదు.

విశ్వమానవ కల్యాణంకోసం అదేపనిగా పరితపించి, తనకు నూతన ధర్మాన్ని గ్రహించి ప్రచారంచేసిన బుద్ధుడు అవతారం చాలించాడు.

కుశినగరమందున్న మల్లనాయకులు బుద్ధుని పవిత్ర శరీరమును రాజాదిరాజులకు జరుగు మర్యాదలతోను, మహా వైభవముతోను కుశినగరమందు దహనముచేసి అనంతరం యస్థికలను ఆ నగరమందున్న సభామందిరములో నుంచి యస్థికలపై బూలదండలువేసి, పరిమళద్రవ్యములుపోసి సంగీతములుపాడి నాట్యములుచేసిరట. తర్వాత నీ మహాపురుషుని యస్థికలలోని కొంతభాగము మగధరాజయిన యజాతశత్రువునకు యిచ్చిరి.

యింకా అనేకమంది నాయకవంశజులు, అనేకమంది భక్తులు ఆ యస్థికనిక్షేపం తమకుకూడా యిమ్మని కోరగా మల్లనాయకులు అందుకు సమ్మతించక నిరాకరించిరి. అపుడు ద్రోణుడను బ్రాహ్మణోత్తముడు వారికిట్లు బోధించెను. "బుద్ధ మహాముని సర్వసోదరత్వము ప్రతిబాదించి బోధించియుండెను. కావున బుద్ధభగవానుని యస్థికలు కోరిన వారంతా మీకు సోదరులై యగుదురు. కావున వారికికూడా యస్థికలు పంచి పెట్టుడని హితోపదేశము చేసెను." అంతట మల్లనాయకులు ద్రోణుండనే వారికి ఆ యస్థికలు పంచిపెట్టమని ప్రార్థించిరి. అట్లే యా బ్రాహ్మణుడు చేసెను. యిట్లు యస్థికలలోని భాగములు పొందినవారు కొంతమంది ఆ భాగములను ధాతుగర్భమందు

దాచి పెట్టుకొనిరి. అనంతరం అశోకచక్రవర్తి బౌద్ధమత స్వీకారనంతరం ఆ పురాతన ధాతుగర్భంబులు దెరపించి, యా అస్థికలను సువర్ణపేటికలయందు భద్రపరచి తన రాజ్యమందు అంతటా వాటిని భూస్థాపితంచేసి వాటిపై కొన్నివేల స్థూపంబులు (సమాదులు) గట్టించి వానిని సురక్షితంబు జేసెను.

"బుద్ధమునిని లోకోపకారియనియు, మహానుభావుడనియు, భగవదంశ సంభూతుడనియు ప్రజలు భావించి కృతజ్ఞులై యుండిరనుటకు నింతకంటె వేరే తార్కాణం ఏమిటి"

## అశోకుడు-బౌద్ధమతవ్యాప్తి

బుద్ధుడు నిర్యాణం పొందినా భారతదేశంలో బౌద్ధమతం క్రమక్రమంగా వ్యాపించసాగింది. ఇలా సుమారు రెండున్నర శతాబ్దాలు గడిచాయి. అప్పటికి అశోక చక్రవర్తి అధికారంలోకి వచ్చాడు. ఇది క్రీస్తుకు పూర్వం 273 వ సంవత్సరంనాటి మాట. అతడు కళింగరాజ్యంపై భీకరమైన దండయాత్ర సాగించాడు. యుద్ధంలో విజయలక్ష్మి అతనినే వరించింది,

కాని వేలాది సైనికులు బలిఅయిపోయారు. నెత్తురు టేర్లు ప్రవహించాయి. ఆదృశ్యం అశోకుని కలచివేసింది. అంతేకాదు. అతని చిత్తవృత్తినే పూర్తిగా మార్చివేసింది.

దానితో అతడింక యుద్ధాలు చేయననీ, బౌద్ధధర్మాన్ని అనుసరిస్తాననీ ప్రతిజ్ఞ పట్టాడు. వెంటనే తాను అవలంబించడమే కాకుండా దేశమంతటా బౌద్ధమత సిద్ధాంతాలను ప్రచారం గావించడానికి ఎన్నో స్తూపాలు కట్టించాడు, అనేకమైన శిలా స్తంభాలు నాటించాడు, వేలాది శిలా శాసనములు ప్రకటించాడు. యీ శిలా శాసనముల మీద బౌద్ధధర్మములు చెక్కించి ఎన్నెన్నో తావుల స్థాపించాడు. కాగా బౌద్ధమత ధర్మ ప్రచారం నిమిత్తం అశోకుడు సిరియా, ఈజిప్టు, బర్మా, సయాం మొదలైన యితర దేశాలకు కూడా దూతలను పంపించాడు. అదీగాకుండా తనకుమారుడైన మహేంద్రుడునీ, కుమార్తె సంగమిత్రనూ కూడా సింహళంపంపి ప్రచారం చేయించాడు. ఈ రీతిగా వివిధ దేశాలలోనూ బౌద్ధమతం తీవ్రప్రచారాన్ని పొంది ప్రజల ఆదరాన్ని చూరగొన్నది. తర్వాత క్రమంగా యీమతం టిబెట్, చైనా, మంగోలియాలకు కూడా వ్యాపించింది. వీటిలో చాలాచోట్ల నేటికీ బౌద్ధమతం విశేషవ్యాప్తిలో వున్నది అందువల్లనే అశోకుడు యిప్పటికీ టిబెట్, చైనా, జపాన్, ఇండియా మొదలైన దేశాలలో అమితంగా కీర్తించబడుతున్నాడు. ఇంకా పెక్కుమంది యితర రాజులుకూడా బౌద్ధమత ధర్మాన్ని స్వీకరించి ప్రచారంచేసినా అందరిలోనూ అశోకునిదే అగ్రతాంబూలమని చెప్పక తప్పదు.

# ఆంధ్రావనిలో బౌద్ధమతం

క్రీస్తుకు పూర్వం ధాన్యకటకాన్ని శాతవాహన రాజులు పరిపాలిస్తూన్న సమయంలోనే తెలుగు మాగాణంలో బౌద్ధలత నాటుకుని చిగిర్చింది. ఆనాడు బౌద్ధమత ధర్మప్రచారం నిమిత్తమై వచ్చిన మహాదేవభిక్షువు కృష్ణా తీరమందలి ధాన్యకటకాన్ని అంటే ప్రస్తుత అమరావతిని నివాసంగా చేసుకుని శాతవాహనుల సహాయంతో యిక్కడ బౌద్ధమతాన్ని నెలకొల్పాడు. మత దురభిమానంలేని శాతవాహనులు బౌద్ధతత్వ ప్రచారానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేయించారు. వారి ప్రయత్న ఫలితంగా ధరణికోట, నాగార్జునకొండ, జగ్గయ్యపేట, శ్రీకాకుళం, భట్టిప్రోలు, రామిరెడ్డిపాలెం మొదలైన చోట్ల బౌద్ధ సంఘారామాలూ, స్తూపాలూ వెలశాయి. అపుడు ధాన్యకటకంలో వెలసిన ఆరామం దక్షిణాది కంతకూ తలమానికం నంటిది. ఇందలి స్తూపాన బుద్ధుని ధాతువు నిక్షిప్తం అలాగే నాగార్జుని కొండలోని స్తూపమందు బుద్ధుని అస్థి వున్నది. ఈమధ్య పరిశోధనలలో అది బయటపడగా దానిని సాంచీలోని మూలగంధ కుటీవిహారంలో భద్రపరచి పూజిస్తున్నారు. ధాన్యకటక సంఘారామాన్నీ, దాని విశ్వ విద్యాలయాన్నీ ఆదర్శప్రాయంగా తీసుకునేనాడు టిబెట్‌లోని డాపంగ్ సంఘారామమూ, విశ్వవిద్యాలయమూ స్థాపించ

బడ్డాయి. సింహళమందలి అనూరాధాపురంలో నిర్మించబడిన బౌద్ధస్తూప ప్రారంభోత్సవ సందర్భంలో తెలుగుగడ్డనుండి వేలాది బౌద్ధబిక్షువులూ, ఆంధ్రశిల్పాచార్యులూ పాల్గొన్నారు. మహాదేవబిక్షుని నాటినుంచీ స్వదేశ విదేశాలలో ఆంధ్రుల ద్వారా బౌద్ధమతం విరివిగా ప్రచారమైంది. మగధలోనూ, యింకా యితర ప్రాంతాలలోనూ జరిగిన బౌద్ధసంగతులలో ఆంధ్ర పండితులు అత్యుత్తములుగా ప్రశంసించబడ్డారు. ఈ రీతిగా బౌద్ధమతవికాసానికి తెలుగునాడు అపారమైన కృషి సాగించినట్లు తెలుస్తోంది. శంకరుల మాయావాదానికి మూల కారణమయిన తాత్విక వాతావరణాన్ని సృష్టించిన నాగార్జునాచార్యునివంటి తత్వవేత్తను ప్రపంచాని కందచేసినదికూడా ఆంధ్రమాతయే. ఇక్ష్వాకుల కాలాన వెలసిన నాగార్జునుని కొండ శిల్పాల విశిష్టత-అమరావతీ శిల్పాల ప్రత్యేకత జగత్ప్రసిద్ధమైనవేకదా! బౌద్ధ తత్వశాస్త్ర నిర్మాణంలోనేగాక బౌద్ధకళాక్షేత్రాల నిర్మాణంలోకూడా మనవారు ప్రసిద్ధికెక్కినవారే. అజంతా, ఎల్లోరా, సాంచీ, సార్‌నాథ్‌లలోని బౌద్ధశిల్పాలపై ఆంధ్రశిల్పకళా ముద్రలున్నట్లు కళాకోవిదులు తలపోస్తున్నారు. కేంద్ర ప్రభుత్వంవారు శ్రేష్టమయిన బౌద్ధశిల్పానికి మచ్చుతునకలను తెలుగుదేశంనుంచి తీసుకువెళ్ళియే నేటికీ విదేశీయ కళాకారుల్ని ముగ్ధులను చేస్తున్నారు.

ఈ విధంగా ఆంధ్రావని ఆదినుంచి నేటివరకూ బౌద్ధమతాన్ని ఆదరిస్తూ వచ్చింది.

## బౌద్ధమతం-హిందూమతం

హిందూమతానికి బౌద్ధమతం యెటువంటి పరిణామాలు కల్పించినదన్న సంగతి విచారించవలసిన అవసరమున్నది. నూతన మతస్థాపకుడైన బుద్ధుడు హిందూమతాన్ని తుడిచిపెట్టాలని యెన్నడూ యేవిధంగానూ ప్రయత్నించలేదు. సమాజాన్ని సంస్కరించాలన్న దృష్టితో అతడు కృషి సాగించాడు. అయితే అతని అమోఘ వ్యక్తిత్వమూ, అద్వితీయ సందేశమూ కోట్లాది జనుల్ని ఆకర్షించడంవల్ల తప్పనిసరిగా బౌద్ధ-హిందూ మతాల మధ్య కొంత వైరుధ్యం ఏర్పడింది బుద్ధుడు హిందూమతముల సిద్ధాంతాలను అంగీకరించినా ఆ మతాచార్యుల ఆధ్వర్యం క్రింద పెరిగిపోతున్న దురాచారాలనూ, అక్రమాలనూ ఖండించాడు. భారతీయుల జీవితంలో బౌద్ధమతం యెన్నోవిధాలుగా పలుకుబడి సంపాదించుకుని వెయ్యి సంవత్సరాలపాటు విశేషమైన వ్యాప్తిని పొందింది. హిందూమతం దేశంవెలుపలి స్థితిగతులను పరిశీలించకుండా తనదారిని తాను పోతూ వుండడంవల్ల అప్పటి పాలకులకు విదేశాలతో వ్యాపారం కష్టతరమైపోయింది. దానికితోడు విదేశ వ్యాపారంయొక్క అగత్యం బాగా పెరిగిపోయింది. ఆ స్థితులూ బౌద్ధమతం మనకు విదేశాలతో సన్నిహితత్వాన్ని సమకూర్చి వ్యాపారాదులు విరివిగా జరగడానికి యెంతో ఉపకరించింది. ఈ మతాన్ని విదేశాలలో ప్రచారం గావించడంద్వారా మనకు అంతర్జాతీయ వాణిజ్య

రంగాన్ని ఏర్పరచిన మొదటి చక్రవర్తి అశోకుడేనన్న సంగతి పైన చెప్పబడిందికూడా.

బౌద్ధమతానికీ-హిందూమతానికీ మధ్య చాలా తేడా లుండడంవల్ల తరచుగా రెండు మతాలవారికీ అభిప్రాయ భేదాలు కలుగుతూ వుండేవి. అయినప్పటికీ కొన్ని శతాబ్దాలు పాటు బౌద్ధమతం మనదేశంలో అనన్య ప్రచారం పొందింది. ఇతరదేశస్థులు ముఖ్యంగా చైనా యాత్రికులు యిక్కడకు వచ్చి బౌద్ధమతానికి స్వదేశంలోవున్న పలుకుబడిని చూసి ఆశ్చర్యపోయేవారు కూడా.

ఇలావుండగా హైందవ వేదాంతులలో ప్రముఖుడైన శంకరాచార్యులవారు బయలుదేరి బౌద్ధమతంలోవున్న ఆచారం ప్రకారమే హిందూమతంలో కూడా సన్యాసులకు మఠాలూ మొదలైన ఏర్పాటు చేసి తీవ్రంగా ప్రచారం సాగించాడు. క్రమంగా భారతావనిలో హిందూమతం తిరిగి ప్రాబల్యం సంపాదించింది. బౌద్ధమతానికున్న పలుకుబడి తగ్గిపోయింది.

ఈ దేశంలో జైన మతవ్యాప్తికూడా బౌద్ధమతానికి దెబ్బతీసింది.

## చైనాలో బౌద్ధమతం

భారత దేశానికీ - చైనా దేశానికీ మధ్య సన్నిహిత సంబంధాలు ఏర్పడడానికి బౌద్ధమతం మూలకారణ మనడం నిర్వివాదం. అశోక చక్రవర్తికి పూర్వం యీ రెండు దేశాలకూ సంబంధా

లున్నదీ లేనిదీ మనకు తెలియదు. చైనానుంచి సిల్కు మన దేశానికి సముద్రంగుండా వచ్చేదనిమాత్రం తెలియవచ్చింది. అశోకుడు బౌద్ధమత ప్రచారకులను చైనాకు పంపిన దగ్గర నుంచీమాత్రం యీ రెండు దేశాలకూ విశేషమైన సన్నిహితత్వం ప్రారంభమైంది. పెక్కుమంది చైనా యాత్రీకులు యిక్కడకు రావడమూ, మనయాత్రికులు చైనా వెళ్లడమూ మొదలయింది. దానితో బౌద్ధమతమూ, భారతీయ సంస్కృతి మధ్య ఆసియా అంతటా విరివిగా వ్యాపించాయి.

మొట్టమొదట కాశ్యపమతంగుడనే భారతీయ తత్వవేత్త చైనా వెళ్లినట్లు తెలుస్తోంది. అప్పుడు చైనా పాలకుడుగా వున్న 'మింగ్‌టీ' ఆహ్వానంపై అక్కడకు వెళ్లిన కాశ్యపమతంగుడు 'లూ' నదీ ప్రాంతానగల లూయాంగ్‌లో స్థిరపడ్డాడు. ధర్మరక్షుడనే మరొక తత్వవేత్తకూడా అతనితో వెళ్లాడు. తర్వాత బుద్ధభద్ర, జినభద్ర, కుమారజీవ, పరమార్థ, జీనగుప్త, బోధిధర్మ మొదలైనవారు అక్కడకు వెళ్లారు. వారిలో ప్రతిఒక్కరూ తమతో కొంతమంది బౌద్ధసన్యాసులను వెంటబెట్టుకుని వెళ్లారు. ఆ సమయంలో ఒక లూ యూంగ్ ప్రాంతంలోనే మూడువేలమంది బౌద్ధసన్యాసులూ, పదివేల భారతీయ కుటుంబాలూ చైనాలో నివాస మేర్పరచుకున్నట్లు చరిత్ర చెపుతున్నది. ఈ తత్వవేత్తలంతా తమతో పెక్కు సంస్కృతగ్రంథాలను తీసుకువెళ్ళి చైనా భాషలోకి అనువదించడమే గాకుండా చైనాభాషలో స్వతసిద్ధంగా చాలా

పుస్తకాలు కూడా రచించి చైనా సారస్వతానికి అపారమైన సేవ చేశారు. వారిలో 'కుమారజీవ' అనే ప్రముఖుడు వ్రాసిన 47 గ్రంథాలు మనదేశానికి వచ్చాయికూడా. చైనాభాషలో అతనిశైలి మనోహర మైనదని చైనా దేశీయులే ప్రశంసించారు. భారతీయ ప్రముఖులలో నొకడైన నాగార్జునుని జీవితాన్నికూడా అతడు చైనాభాషలోకి అనువదించాడు. 'జినగుప్త' అనే మరొక భారతీయ ప్రముఖుడు 37 సంస్కృత గ్రంథాలను చైనాభాషలోకి అనువాదంచేసి ఆ దేశ పాలకుని మన్ననలు కూడా పొందాడు.

పోతే యిక చైనాదేశంనుంచి భారతావనికి వచ్చిన తత్వవేత్తల సంగతి.

ఫాహియాన్, (*Fahien*) సంగ్‌యున్, (Sung *Huen*) హుయాన్ సాంగ్ (*Huen Tgiang*) మొదలైన చైనా తత్వవేత్తలు మొదట యిక్కడకు వచ్చారు. వారిలో ఫాహియాన్ చైనాలో కుమారజీవకు అనుచరుడు. ఫాహియాన్ భారతదేశానికి బయలుదేరేటప్పు డతనితో కుమారజీవ మతానికి సంబంధించిన వివరాలు సేకరించడంతో కాలాన్ని వృథా చేయవద్దనీ, భారత ప్రజల జీవిత సరళినీ ఆచార, వ్యవహారాలనూ గమనిస్తే అవి చైనాప్రజలు భారతీయులను అర్థం చేసుకొనడానికి ఉపకరిస్తాయనీ అన్నాడట. ఫాహియాన్ (*Fahien*) యిక్కడకువచ్చి పాటలీపుత్ర విశ్వ విద్యాలయంలో చదువుకున్నాడు. చైనానుంచి మన దేశానికి వచ్చిన వారందరిలోనూ

ముఖ్యంగా పేర్కొనవలసిన ప్రముఖుడు హుయాన్‌సాంగ్ (huen Tgiang) ఇక్కడ అతడూ అన్నిప్రాంతాలలోనూ పర్యటించి ప్రతిచోటా ప్రజలచే గౌరవించబడ్డాడు. ప్రతివిషయాన్నీ శ్రద్ధతో పరిశీలించి కొన్ని విచిత్రగాథలను వ్రాసుకున్నాడు. అతడు పాటలీపుత్రానికి దగ్గరలోనే వున్న నలందా విశ్వవిద్యాలయంలో చదివి న్యాయశాస్త్రంలో పట్టా తీసుకుని క్రమంగా ఆ విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షుడుకూడా అయ్యాడు. ఇండియాకు హుయాన్‌సాంగ్ రాకవల్ల యీ రెండు దేశాల రాజకీయ సంబంధాలూ బాగా పెరిగాయి. అప్పటికి మనదేశాన్ని పాలిస్తున్న హర్షవర్ధనుడు చైనాకు రాయబారిని పంపాడు. చైనా రాయబారి యిక్కడకు వచ్చాడు, హుయాన్‌సాంగ్ కొంత కాలంపాటు భారతదేశంలో గడిపి తర్వాత చైనా వెళ్లి అక్కడ గతించాడు.

ఇలా రెండు దేశాలమధ్యనూ సాన్నిహిత్య మేర్పడడం బౌద్ధమతవ్యాప్తి సమయంలో రెండింటికి వ్యాపారంకూడా విపరీతంగా సాగింది. భారతదేశంనుంచి చైనాదేశమూ—చైనానుంచి భారతావనీ యెన్నో విషయాలు నేర్చుకున్నాయి. అయితే చైనాపై ఇండియాయే విశేష పలుకుబడిని ప్రసరించగలిగింది. భారతావనిలో బౌద్ధమతవ్యాప్తి తగ్గడంతో కొన్ని శతాబ్దాలపాటు చైనా - భారతదేశాలమధ్య గల సంబంధం దెబ్బతిన్నది. తిరిగి బ్రిటీషువారిద్వారా రెండూ దగ్గరకు వచ్చాయి.

మనదేశంలో బౌద్ధమతం సన్నగిల్లినా చైనాలో మాత్రం అది దినదినాభివృద్ధి పొందుతూనే వున్నది. అనేక చోట్ల బౌద్ధదేవాలయాలు నిర్మించబడ్డాయి. పాఠశాలలు నెలకొల్ప బడ్డాయి. వీటన్నిటికీ నేటి చైనా ప్రభుత్వం తగిన సదుపాయాలూ, రక్షణలూ కల్పించింది. శిథిలమైన దేవాలయాలను ప్రజా ప్రభుత్వం మరమ్మతు చేయించింది. 1953 వ సంవత్సరం జూన్ నెలలో పెకింగ్‌లో చైనా బౌద్ధ సంఘం నెలకొల్పబడింది. దానిద్వారా చైనాలోని బౌద్ధులకూ, ఆసియాలోని యితర ప్రాంతాలలో గల బౌద్ధులకూ సంబంధాలు ఆరోజు కారోజు దగ్గరవుతున్నాయి. చైనాలోని బౌద్ధులు ప్రశాంతంగా తమకాలాన్ని బౌద్ధమత ప్రచారం లోనూ, బౌద్ధధర్మ సూక్ష్మాల పరిశీలనలోనూ గడుపుతూ శాంతియుతంగా దేశనిర్మాణ కార్యక్రమంలో ప్రజానీకంతో బాటు చేతులుకలిపి కృషి సాగిస్తున్నారు.

## బుద్ధుని ప్రబోధ సారాంశాలు

ధనికుడూ - దరిద్రుడూ, అగ్రజాతి

వాడూ - తక్కువ జాతివాడూ

అంతా ఒకటే. నదులన్నీ సముద్రంలో కలసి పోయినట్లుగానే అన్ని జాతులూ బౌద్ధమతంలో కలుస్తాయి.

ఈ ప్రపంచంలో శత్రుత్వం ఎన్నడూ శత్రుత్వంవల్ల తొలగిపోదు. ప్రేమవల్లనే శత్రుత్వం నశించిపోతుంది.

మానవుడు కోపాన్ని దయచేతనూ, చెడుగును మంచి చేతనూ సాధించాలి.

దారుణమైన యుద్ధంలో ఒకవ్యక్తి వెయ్యిమందిని అవలీలగా జయించవచ్చు. కాని అంతమాత్రంలో అతడు విజయవంతుడు కాడు. తనను తాను జయించుకొనగల్గినవాడే నిజమైన విజయుడు.

ఇతరులతో పోరాడి సాధించబడిన విజయం మనఃక్లేశానికి దారితీస్తుంది,

నా సూత్రాలను వ్యక్తిగతంగా నాపైగల అభిమానంకొద్దీ యెవరూ గ్రుడ్డిగా అనుసరించరాదు. బంగారం నిప్పుతో పరిశోధించ బడినట్లుగా ముందు పరిశోధన గావించాలి.

భగవానుడున్నాడా ? లేడా ? అన్న వాదంతో మనం కాలాన్ని వృథా చేయడం అనవసరం. మనం తెల్సుకొనగలిగిన, సాధించగలిగిన విషయాలనే మనం యోచించాలి.

ఇలా యెన్నో సూక్తులను బుద్ధుడు తన సందేశాలలో వివరించి యావత్ప్రజానీకంలోనూ నూతన చైతన్యాన్ని కలిగించాడు. ఈ బోధనలన్నీ అటు పండితుల హృదయాలలోనూ, యిటు పామరుల హృదయాలలోనూ కూడా గాఢంగా నాటుకు పోయాయి. అతడు తన బోధనలు చేసేముందుగా యేమతంయొక్క అనుమతినీ తీసుకోలేదు. భగవంతుని గురించి గాని, యితర లోకాలను గురించిగాని యోచించలేదు. కారణం

తర్కం, అనుభవం వీటిమీదనే ఆధారపడి అతడు తన సందే శాన్ని అందచేశాడు. ప్రజలనే నిజమాలోచించి నిర్ణయించు కొనవలసిందని కోరాడు. అందువల్లనే బుద్ధుని ప్రపంచ ప్రవక్తలలో ప్రముఖుడుగా మానవకోటి పేర్కొన్నది.

## బుద్ధుడు-క్రీస్తు-గాంధీ

అజ్ఞానాంధకారంలో అల్లాడి
పోయే అమాయక ప్రజా బాహు

ళ్యానికి వెలుగు బాటను చూపిన ప్రపంచ మహా పురుషులు ముగ్గురున్నారు.

వారే బుద్ధుడు-క్రీస్తు-గాంధీ. ఈ ముగ్గురిలోనూ యిద్దరు మహానీయులు బుద్ధుడూ-గాంధీ మహాత్ముడూ మన పవిత్ర భారతమాత గర్భాన జనించినవారే. ఇది ప్రపంచంలో భారతా వనికి ప్రత్యేక గర్వకారణం.

ఇంతవరకూ మనం బుద్ధుని జీవిత విశేషాలను గురించీ, అతడు జీవకోటి సౌభాగ్యంకోసం గావించిన మహత్తర కృషిని గురించీ తెల్సుకున్నాం. దీనినిబట్టి అతడు శాంతిదూతఅనీ, కరుణామయుడనీ, మానవోత్తముడనీ తేలగలదు.

సమస్త భోగ భాగ్యాలూగల రాకుమారుడు నూనూగు మీసాల నూత్న యౌవనంలో అన్నివిధాలా అనుకూలవతి అయిన యిల్లాలినీ, అప్పుడే పుట్టిన అనుగు పుత్రునీ, చేతికి

వచ్చిన రాజ్యాధికారాన్ని పరిత్యజించి ప్రాణికోటి కష్టాలను నివారించే పరమాశయంతో అడవులపాలై అదేపనిగా అలమటించి పోయాడంటే... ...అబ్బ. తల్చుకుంటే గుండెలు పగిలి పోయే సంఘటన అది.

ఆ రాత్రి...సర్వ సంగ పరిత్యాగిగా యిల్లువిడిచి వెళ్లే సమయంలో అతని మనస్సు యెంత ఆవేదన పొందిందో, యెంతగా కాళ్ళు తడబడ్డాయో యెవరు చెప్పగలరు ?

మరునాటి ఉదయం లేవగానే... ...ప్రాసాదమంతా వెదకినా తనభర్త, తనదైవం యెక్కడా కానరానప్పుడు... తర్వాత అతడు యిల్లువిడిచి వెళ్లిపోయాడని తెల్సినప్పుడు ఆ పతివ్రతా శిరోమణి యశోధర యెంత విలపించిందో, యేమని దుఃఖించిందో యెవ రూహించగలరు ?

పాపం ! అప్పుడే పుట్టిన పసికూన తండ్రి ఒడిలో కూర్చునేభాగ్యం తనకు లేదన్నసంగతి. ఆ కుమారునకేం తెల్సు ?

గత్యంతరంలేక చేతులారా దీవించి పంపినా, తల్లి పోయిన నాటినుంచీ తానే సర్వస్వమూ అయి పెంచి పెద్దచేసి, విద్యాబుద్ధులు నేర్పించి రాజ్యాధికారాన్ని హస్తగతం చేయాలని ఉబలాటపడ్డ ఆతండ్రి–శుద్ధోదనుడు నాడెంత కుమిలి పోయాడో యెవరు వివరించగలరు ?

నిజమే. అది దారుణ సంఘటన అయితే బుద్ధుని దృష్టిలోమాత్రం కాదు. అతని దృష్టిలో దారుణ సంఘటనలు వేరు.

అవి-హింస, జర, మరణం మొదలైనవి.

అందుకే తను గోలీలాడుకునే ప్రాయంలోనే ఆకాశ మార్గాన పోయే హంస వేటగాని బాణానికి గురిఅయి తన పాదాలదగ్గర పడిపోయినప్పుడు ఆబాణం తనకే గుచ్చుకొన్నట్లు నొచ్చుకుని అపరిమితమైన బాధ పడ్డాడతడు.

నడి యౌవనంలో ఒకనాటి సాయంత్రం విహారార్థమై కపిలవస్తు నగరంలో తిరుగుతూ ఒకచోట రోగంతో కృశించి పోతున్న మూడుకాళ్ళ ముసలివానినీ, వేరొకచోట మృత కళేబరాన్నీ చూసి మానవ జీవిత మింతేనా? యిక దీనికి విరుగుడు లేదా? అని పరితపించి పోయాడతడు.

ఆ సంఘటనలే అతనిని కలచివేశాయి. అవే పూజ్యుడైన తండ్రిపైనా, కట్టుకున్న భార్యపైనా, ముద్దుల కుమారునిపైనా, చేతిలోనున్న భోగ భాగ్యాలపైనా అతని వ్యామోహాన్ని తుడిచిపెట్టాయి. సన్యాసిగా మార్చి అడవుల పాలు చేశాయి. జీవకోటి కష్టపరంపరల నివారణ అతని మహత్తర లక్ష్యం. ఆ లక్ష్యసాధనకోసం కంకణం కట్టుకున్నాడు. కనకనే అడవులలో అలమటించే కష్టాన్ని అతడు తన కర్మగా భావించుకొనలేదు. బిచ్చాటనాన్ని నీచంగా తలపోయలేదు.

ఎన్నో ప్రాంతాలు తిరిగాడు. ఎందరో గురువుల్ని ఆశ్రయించాడు. సంవత్సరాలకు సంవత్సరాలు అరణ్యంలో ఏకాకిగా సంచరించాడు. నిశ్శబ్దదీక్షతో తపస్సు కొనసాగించాడు. ఎన్నికష్టాలు పడితేనేం? తుదకు తన ఆశయాన్ని సిద్ధింప చేసుకున్నాడు. బోధి వృక్షం నీడల్లో అమర సందేశాన్ని అందుకుని భూమిపై అమృతాన్ని వర్షింప చేశాడు. అతని చూపుల్లో దయారసం – మాటల్లో అహింస–అడుగుల్లో శాంతి వెల్లివిరిశాయి. మానవజాతికి తరుణోపాయం లభించింది. బుద్ధుడు అనితార పురుషుల స్థానాన్ని అలంకరించాడు.

నేడు భారతావనిలో బౌద్ధమతం ప్రత్యేకమతంగా వ్యాప్తిలో లేకపోయినా బుద్ధుడుమాత్రం భారతీయులచే ఆరాధించబడుతూనే వున్నాడు. అప్పుడు ఆరాధించ బడడమే కాదు. భారతావని సజీవమై వున్నన్నాళ్ళూ ఆ అఖండ దయానిధికి జోహార్లర్పిస్తూనే వుంటుంది.

ఇక బుద్ధుని తర్వాత జన్మించిన మరొక మహాపురుషుడు ఏసుక్రీస్తు. అతడు భారతావనిలో జన్మించినవాడు కాకపోయినా మానవప్రపంచ క్షేమంకోసం పాటుపడిన వ్యక్తి కావడంవల్ల యిక్కడ అతనిని స్మరించడం అత్యావసరం. అతడు కూడా కొత్తమతాన్ని లేవదీసి పాతమతాలపేరిట జరిగే అన్యాయాలనూ, అక్రమాలనూ యెదుర్కొన్నాడు. ఆక్రత్రవ్య నిర్వహణలో అతడు పడరానిపాట్లు పడ్డాడు. క్రీస్తునూ అతని అనుచరులనూ నాటి ఛాందస ధనికవర్గం ప్రజా ద్రోహులుగా

పరిగణించి హింసపెట్టింది. అంతేకాదు. ఆ కాలంలో పరిపాల కులుకూడా క్రీస్తును ద్రోహిగానే జమకట్టి బాధలుపెట్టారు.

అయితే వాటన్నిటికీ జడిసిపోయి తనధర్మాన్ని తాను నిర్వర్తించడం మానివేశాడా క్రీస్తు ? లేదు. అతడు సామాన్య మానవుడుకాడు. ముదురుతమస్సులో మునిగి కొట్టుకుపోతున్న మానవాళికి తేజోమయ మార్గాన్ని చూపేనిమిత్తం అవత రించిన మహాప్రవక్త. అందువల్లనే జీవిత కాలమంతా తనకు ప్రాప్తించిన హింసలను చిరునవ్వుతో అనుభవించాడాయన. అధిక సంఖ్యాకులానాడు తనకు విరోధులైనా తనతో కూడా వున్న కొద్దిమంది శిష్యులను వెంటపెట్టుకుని క్రీస్తుమహాశయుడు మానవసేవ సాగించాడు. ఆ యుగపురుషుని ప్రభావ మెటు వంటిదోగాని అతడు తన చల్లనిహస్తంతో తాకినంత మాత్రాన యెందరో వ్యాధిగ్రస్తులు సంపూర్ణారోగ్యాన్ని పొందారు. కాళ్ళులేనివారికి కాళ్ళూ, కళ్ళు లేనివారికి కళ్ళూ తిరిగి వచ్చాయి. హృదయ పూర్వకంగా ఆ మహనీయుడ్ని స్మరిం చినవారు తిండికీ, బట్టకూ లోటులేకుండా జీవితాలు వెళ్ళ బుచ్చుకున్నారు. ఇలా నిత్యమూ మానవసేవచేస్తూ దానితో పాటు శాంతి-ప్రేమ-అహింస మొదలైన అత్యుత్తమ లక్ష్యా లను ఆయన ఆచరణలో పెట్టడంద్వారా అనన్యప్రచారం సాగించాడు.

కాని యెంతచేసినా ఆనాడు ప్రపంచం ఆయనను అర్థం చేసుకోనలేక పోయింది. దానిఫలితంగా తుదకాయన

శిలువకు బలికావలసి వచ్చింది కూడా. అయితే కాలచక్రం తిరిగింది. దానిపరిణామంలో క్రమంగా క్రీస్తుయొక్క మహాత్యం అందరకూ వెల్లడయింది. క్రైస్తవమతం ప్రపంచవ్యాప్తిని పొందగలిగింది, క్రీస్తు మహాశయుడు మహానుభావుడుగా ప్రపంచంచే ఆరాధించ బడుతున్నాడు. బుద్ధుని తర్వాత లోక కల్యాణం కోసమై అవతరించిన మానవోత్తముడు ఆయనే.

ఇంతవరకూ మనం యిద్దరు మహనీయుల్ని స్మరించాం. పోతే మూడవ ప్రముఖుడు మన మహాత్మా గాంధీ.

మన అందరి అదృష్టంవల్లనూ ఆయన యీ యుగం లోనే జన్మించాడు. బుద్ధుడూ – గాంధీ – యీ యిద్దరు భారతీయులూ అవతరించిన శకాలకు చాలా తేడా వున్నది. బుద్ధుని కాలంనాటికి మన దేశం పరాయి వారెవరి అధీనంలోనూ లేదు. కాని గాంధీజీ సమయానికి భారతజాతి బ్రిటీషువారి చేతిక్రింద బానిసగా క్రుమ్గిపోతున్నది. ప్రపంచంలో భారతావనికొక విశిష్టతగాని, భారతీయులకు ప్రత్యేక వ్యక్తిత్వంగాని లేకుండా పోయాయి. రాజకీయంగానూ, సాంఘికంగానూ, ఆర్థికంగానూ కూడా మనం అడుగున పడిపోయాము.

ఆ స్థితిలో సామాన్య కుటుంబీకుడైన గాంధీజీ సత్యాగ్రహాయుధాన్ని చేతపుచ్చుకుని రాజకీయ రంగంలో దుమికాడు. ఆయన జీవిత మూలసూత్రాలుకూడా శాంతి-సత్య-అహింసలే. వాటి నాధారంగా తీసుకునే బ్రిటీషువారిపై

శాంతిసమరం కొనసాగించాడు. మొదట్లో యావత్ప్రపంచమూ ఆ మహామహుని యుద్ధపద్ధతిని హేళనచేసింది. విప్లవం చెల రేగకుండా, నెత్తురు టేరులు ప్రవహించకుండా సత్యాగ్రహం జరిపినంత మాత్రంలో స్వరాజ్యాన్ని పొందడమెలా సాధ్యమని పెదవులు విరిచింది. కాని ఆ శాంతిసమరం దిగ్విజయాన్ని పొందింది. భారతదేశం యావత్తు మహాత్ముని అడుగుజాడలలో నడచుకుని స్వరాజ్యాన్ని సంపాదించుకుంది. ఇది లోకంలో యింతకు ముందెన్నడూ కని విని యెరుగని మహత్తర సంఘటన. రాజకీయంగా దేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించి పెట్టడమే కాకుండా సాంఘికంగానూ, ఆర్థికంగానూ అద్వితీయమైన కృషి సాగించాడు బాపూజీ. అంటుజాడ్యంవలె మన దేశమంతటా ఆవరించి పోయిన అంటరానితనాన్ని సమూలంగా నిర్మూలించడంకోసమూ, భారత సౌభాగ్యానికి మూలమైన గ్రామసీమలను అభివృద్ధి పరచడంకోసమూ, జాతినంతనూ కృంగదీస్తూ వచ్చిన అవిద్యను రూపుమాపడంకోసమూ, మానవజాతి పతనానికే హేతుభూతమైన మతకలహాలకు స్వస్తి చెప్పడంకోసమూ మహాత్ముడు తన సర్వస్వాన్ని ధారపోసి పాటుపడ్డాడు. అటు రాజకీయరంగంలో బ్రిటీషు ప్రభుత్వం ఆ మహానీయుడ్ని పెట్టినహింసలూ, యిటు యితర రంగాలలో ఆయన యెదుర్కొన్న క్లిష్టపరిస్థితులూ యీతరంవారందరకూ తెల్సినవే. ఆఖరుకు యేమత సహనంకోసమై ఆయన జీవితాంతం

వరకూ కృషిసాగిస్తూ వచ్చాడో ఆ మత సమస్యమీదనే ఒక మతోన్మాది తుపాకి గుండుకు బలి అయిపోయాడు కూడా.

అయితే ఒకముఖ్య విషయం.

బుద్ధుడు – క్రీస్తు – యీ యిద్దరికాలాలలోని ప్రజానీకం వారిని గుర్తించుట కన్న, యీతరంలోని ప్రజాబాహుళ్యం గాంధీజీ జీవితకాలంలోనే ఆయన ప్రతిభా విశేషాలనూ, సేవా నిరతినీ విశేషంగా గుర్తించింది. అందుచేతనే మహాత్ముడు అవతారం చాలించాడన్నవార్త తెలియగానే యావత్ప్రపంచమూ ఒక ఆప్తుని కోల్పోయినట్లు విలపించింది. అన్ని దేశాల ప్రభుత్వాలూ తమ సంతాపాన్ని ప్రకటించాయి. ఇక మనదేశంలో ఆనాడు బాపూజీని తల్చుకుని బావురుమని రోదించని భారతీయులే లేరు.

నేడు ఆ మహనీయుడు మనమధ్య లేకపోయినా ఆయన సంపాదించిపెట్టిన స్వాతంత్ర్యాన్ని మనం అనుభవిస్తున్నాం. ఆయన ప్రారంభించిన హరిజనాభ్యుదయం, గ్రామోద్ధరణ, వయోజన విద్యావ్యాప్తి మొదలైన ఉద్యమాలన్నీ ముందుకు సాగిపోతూ అభివృద్ధిని సాధిస్తున్నాయి.

ఇక పోతే బుద్ధుడు, క్రీస్తు, గాంధీలు ముగ్గురూ మరొక మహోపకారం చేశారు. వారు తమతమ ఆశయాల ప్రచారణ కోసమై సమర్థులయిన శిష్యుల్ని తయారుచేసి విడిచిపెట్టారు. బుద్ధుని శిష్యులూ, క్రీస్తు శిష్యులూ తమతమ కర్తవ్యాలను

గురుతర బాధ్యతతో నిర్వర్తించి ప్రపంచంలో తమ గురువుల ప్రబోధాలకు శాశ్వత స్థానాన్ని సముపార్జించి పెట్టారు. నేడు మన బాపూజీ శిష్యులుకూడా అదే పద్ధతిలో మహాత్ముని లక్ష్యాల ఆచరణకు ప్రచారం సాగిస్తున్నారు.

ఇంతవరకూ ప్రపంచ మహాపురుషులయిన బుద్ధుడు - క్రీస్తు-గాంధీలను గురించి సంగ్రహంగా పేర్కొనబడింది. ఈ ముగ్గురి జీవితాలకూ సన్నిహిత సంబంధ ముండడంవల్లనే బుద్ధుని గురించిన గ్రంథంలో తక్కిన యిద్దరి ప్రశంసనూ తేవలసిన అగత్య మేర్పడింది. ఒక నవ్యాంధ్ర మహాకవి వివరించినట్లుగా యీ ముగ్గురు దివ్యమూర్తుల కన్నులలోని అశ్రుధారా, గుండెలలోని రక్తధారా, కంఠంలోని అమృత ధారా కలసి జగత్కాలుష్యాన్ని కడిగి మానవజాతి నిపునీతం చేశాయి.

## జార్జి కాట్లిన్‌చే-బుద్ధ ప్రశంస

జార్జి కాట్లిన్ సామ్యవాద భావాలు గల పాశ్చాత్య ప్రముఖుడు. ప్రసిద్ధ రచయిత.

సాయుధ విప్లవంతోనూ, రక్తపాతంతోనూ మలినమై పోయిన పాశ్చాత్య ప్రపంచాన్ని విడిచిపెట్టి అహింసాత్మకమైన విశ్వ శ్రేయోవిధానాన్ని గ్రహించాలన్న అభిలాషతో,

మంది భారతీయ ప్రముఖుల్ని కల్సుకుని పుణ్యక్షేత్రాలు సందర్శించి విజ్ఞాన కేంద్రాల కార్యక్రమాలను పరిశీలించాడు. అన్నివిధాలా అతనిని భారతావని అమితంగా ఆకర్షించింది. మన దేశంపట్లా—మన ప్రజలపట్లా—మన సంస్కృతిపట్లా అతనికి అంతులేని సానుభూతి ఏర్పడింది. ముఖ్యంగా మన జాతి పిత బాపూజీ కాట్లిన్ దృష్టికి శాంతిదూతగానూ, విశ్వమానవ కల్యాణ కారకుడుగానూ గోచరించాడు. భారతదేశంలో తన అనుభవాలను పురస్కరించుకుని (*In the fath of Mahatma Gandhi*) అనే అత్యుత్తమ గ్రంథాన్ని రచించాడు, అందులో బుద్ధుణ్ని గురించి కాట్లిన్ వ్రాసిన భాగం యిక్కడ పొందు పరచబడింది.

“నేను పవిత్రమయిన వారణాసికి అనతి దూరంలో వున్న సారనాథం వెళ్లాను. పురాతత్వవేత్త అయిన మిత్రుడు డాక్టర్ ఘోష్‌కూడా వున్నాడు. బౌద్ధానికి నాలుగు క్షేత్రాలు సుప్రసిద్ధాలు—బుద్ధుని జన్మస్థానమైన లుంబినీవనం బుద్ధగయలో జ్ఞానోదయమైన తావు. అశ్వత్థవృక్షం—సారనాథం అనే ప్రదేశాలు బౌద్ధక్షేత్రాలు. సారనాథంలోనే బుద్ధుడు ప్రప్రథమంగా ధర్మచక్ర ప్రవర్తన ఉపదేశించాడు. జ్ఞానభ్యాసమయిన తర్వాత గౌతముడు బుద్ధుడై తన పూర్వ శిష్యకోటిని కల్సుకోవాలని వచ్చాడు.

ఆయనను మొదట శిష్యులు నాస్తికుడన్నారు. సార నాథం వస్తున్న బుద్ధుణ్ని వధించాలని శిష్యాధములు పన్నుగడ పన్నారు. కాని తేజోమయమయిన గురుదేవుని ముఖ

మండలం వీక్షించిన తర్వాత శిష్య హృదయం మారిపోయింది. శిష్యకోటి యావత్తూ మోకరిల్లి ఆయనకు పాదాభివందన మాచరించి సత్కరించింది. ఇక్కడే యిటీవల నామిత్రుడు, భౌతిక విజ్ఞాన శాస్త్రాచార్యుడూ అయిన ఒక అమెరికా దేశీయుడు జ్ఞానియై హీనయాన సాంప్రదాయమైన బౌద్ధధర్మం స్వీకరించాడు.

ఇది ఆర్యాష్టాంగమార్గం-యదార్థ దృక్పథం-యదార్థాశయం- యదార్థ వాక్కు-యదార్థ క్రియ-యదార్థ జీవనం-యదార్థ ఉద్యమం-యదార్థ లక్ష్యం-యదార్థ చింతన. పోతే మధ్యేమార్గం అవలంబించేవారి అభిమతం ఏమిటి?

"సోదరులారా! దుఃఖాన్ని గురించి యిదే ఆర్య సత్యం. జన్మదుఃఖం, జరాదుఃఖం, మరణదుఃఖం. అలాగే ప్రణయ వియోగాలూ, నైరాశ్యాలూ, అవాంఛిత వస్తు సంయోగం, వాంఛిత వస్తు వియోగం కూడా దుఃఖహేతువులే. ఒక్కమాటలో చెప్పాలంటే యీ పాంచ భౌతిక శరీరమే దుఃఖమయం. కనక తృష్ణాక్షయం తృష్ణా పరిత్యాగమే సమస్త దుఃఖ ప్రధ్వంసపథం."

సారనాథంలో ప్రవేశించగానే ప్రాచీన శిథిల శకలాలూ, అశోక చక్రవర్తిచే నిర్మితమైన శిలా స్తంభం, నాలుగు అంతస్తుల మేడవలె యెత్తయిన మహా చైత్యమూ, చిన్న చిన్న స్తూపాలూ నాకంట పడ్డాయి. ప్రథమంగా బుద్ధుని బోధామృతం సోకిన పవిత్ర ప్రదేశంలో నేను అడుగుపెట్టాను.

ఈ బౌద్ధ విహారం భారతీయ దేవశాలలకుగాని, చైనీయ మందిరాలు-ముఖ్యంగా హాంగ్ చే మహోన్నత కోవెలకుగాని యెక్కడా పోలిక లేదు. చైత్య నిర్మాణం చాలాభాగం పాశ్చాత్య రీతిలో సాగినట్లు తోస్తోంది. క్రీస్తుపూర్వం ప్రథమ శతాబ్దంవరకూ సారనాథంలో యెటువంటి ప్రతీకాలూ వెలయలేదు. ఇక్కడ విగ్రహాలు యవనప్రభావం సోకినతర్వాతనే ఆవిర్భవించాయి. ఇక్కడున్న వస్తు ప్రదర్శన శాలల్లోని పురాతన శిథిలావిశేషాలు పురాతత్వ వేత్తలకు బహు ఉత్సాహ కరమైన విషయమే గాని నాకు బుద్ధభగవానుని స్మరణగాథయే మహోత్సాహ పూరితమైనది. బుద్ధబోధలో పరమార్థం నాకు ముఖ్యంగా కావాలి.

తన మరణానంతరం తనకు సంబంధించినవేవీ భూమిలో నిక్షేపం చేయవద్దని బుద్ధుడు శిష్యకోటికి చెప్పాడు. ఈ సందర్భంలో సారనాథంలో ఒకవిచిత్ర సంఘటన విన్నాను. బుద్ధ భక్తులయిన సింహాళీయులు, బుద్ధదేవుని అస్తికలు ధాతువులు సారనాథ నవీన దేవాలయంలో నిక్షిప్తం చేశారు. క్రీ.శ 1932 లవి ధాతు నిక్షేపణ చేసినకాలం శిలాఫలకమీద గండరింపబడింది. గయనుంచి బోధివృక్ష శాఖకతెచ్చి దేవాలయ సమీపాన నాటారు. కాని సారనాథంలో ప్రధాన శిథిలం శేషించలేదు.

1793 లో హిందూరాజు, బాబూ జగత్ సింహుడు తన కాశీవిఫణిని వృద్ధిచేసే నిమిత్తం కంకరకోసమై సారనాథ

శిధిలాలు తవ్వించి పాడుచేశాడు, మహాచైత్యంలో చాలా భాగం ఆ ముష్కరుని చేతులలో సిక్కయిపోయింది. పోగా మిగిలినది చిన్నస్తూపం. కేంద్ర చైత్యంలేదు. కాశీరాజే ఆ అమూల్యమయిన బౌద్ధశిల్పాన్ని నాశనం చేశాడనడంలో సందేహంలేదు.

స్తూపాంతర్భాగంలో శిలామయ శవపేటిక ఒకటి కనబడింది. పేటికలో రజిత పిటకం నిక్షిప్తమయింది. శిలాపేటిక మాత్రం భద్రపరచారు. దానిలోవున్న సువర్ణ పేటికను సంగ్రహించి ద్విగుణీకృతోత్సాహంతో కాశీరాజు వారణాసిలో నున్న బ్రిటీషు రెసిడెంటు జోనాథన్ డంకన్‌కు బహూకరించాడు. డంకన్ విజ్ఞాని, పురాతత్వజ్ఞానం కలవాడు. అందువల్ల దానినిగురించి పత్రికలో ఒక అమూల్యమైన వ్యాసం వ్రాసి ప్రచురించాడు.

డంకన్ వాదమిది: స్వర్ణపేటికలోవున్న ఆభరణాలు. అస్తికలు యెవరో మహామహుని భౌతిక శరీర అవశేషాలనీ, ఆ అస్తికశకలాలు యే హిందూ ధర్మావలంబివో అయినట్లయితే వెంటనే కాశీరాజు గంగాజలంలో నిమజ్జనం చేసేవాడనీ వ్రాశాడు. అవి యే బుద్ధభక్తుని అస్తికలో లేక బుద్ధ భగవానునివే కావచ్చుననన్న మాట ముమ్మాటికీ యదార్థం.

ఇప్పుడా సువర్ణ పేటికా లేదు. అస్తి శకలాలు అంతకన్నా లేవు. ఎక్కడవుండేవో కూడా తెలియదు. ఏ పురాతత్వ

శోధకుడైనా ఆ పేటికను కరిగించి బంగారుముద్ద చేసివుంటాడా? అలాఅయితే అతనికి కిట్టుబాటైన స్వర్ణంకంటే ఆ స్వర్ణపేటిక విలువ అత్యధికమైనదని అతడు తెల్సుకోన లేదన్నమాట. పోనీ బుద్ధభక్తులు పెట్టెను హరించివేస్తారా? అంత పవిత్రమయిన దానిని వారు దొంగిలిస్తారా? లేదా డంకనే సంగ్రహించి రహస్యంగా స్కాట్లండ్ లో దాచుకుంటాడా? ఏమీ బోధపడడంలేదు. కాశీలో బుద్ధధాతు నిక్షిప్తమయిన ఆ పవిత్ర స్వర్ణపేటిక పోయిన సంగతే మెవరికీ పట్టినట్లు తోచదు. బంగారం యే చోరులనో ఆకర్షించిందని నామిత్రులు తేలికగా అనేసి వూరుకుంటారు. కాని చౌర్యంగసంగతి యెక్కడా వ్రాయబడ లేదు.

క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దిలో శ్రావణ పూర్ణిమనాటి సంజవేళ సుమారు ఏడుగంటలకు బుద్ధ భగవానుడు కాశీనుంచి సారనాథం పాదచారిగా వెళ్లాడని చరిత్ర చెప్తున్నది. అక్కడ మాధ్యమిక మార్గమనే అష్టాంగమార్గాన్ని ఉపదేశించాడు. గురూపదేశంగాని, సాక్షాత్కారంగాని మోక్షానికి అవసరం లేదని ఆయన చెప్పాడు. ఆత్మ శాశ్వతత్వాన్ని గురించీ, యజ్ఞయాగాదుల నిరుపయోగత్వాన్ని గురించీ శ్రుతివాక్యాలు ఆధారాలుగ వున్నాయి. కర్మకాండ నిర్వాణానికి తోడ్పడదని ఆయన వాదం. క్షత్రియుడుగాని, శూద్రుడుగాని యెవరయినాసరే మోక్షానికి అర్హులే. మోక్షానికి యాగాదులతో వర్ణాశ్రమాచారాలతో నిమిత్తంలేదు. దేవతలకూ కృష్ణునికీ

కూడా మోక్షం కావలసివచ్చింది. ఆనాడు కేవలం వ్యక్తిగత మైన వర్ణాశ్రమాచార విరుద్ధమయిన నాస్తిక వాదమై, బౌద్ధం విలక్షణమయిన తార్కిక పథాన్ని ఏర్పరచింది.

నాటి ఆచార్య శంకరునివలె-నేటి మహాత్మా గాంధీ వలె హిందువులకు గౌతముడు ధర్మసంస్కర్త. క్రీస్తుశకం తొమ్మిదవ శతాబ్దంలో శంకరులు మహాయాన బౌద్ధతత్వం మాదిరిగానే సనాతన మాయా సిద్ధాంతం సిద్ధాంతం నిర్ధారణ చేశారు. దానితో భారతదేశంలో బౌద్ధానికి క్రమేణా స్థాపనలేకుండా పోయింది. బౌద్ధం మహాయానమై హిందూ సంస్కృతిలో లీనమయింది. బుద్ధదేవుడు దేవతారాధనాన్ని అంగీకరించనే లేదు. అందుచేతనే శిష్యకోటికూడా ఆయనకు దేవత్వాన్ని ఆపాదించి పూజించలేదు. విద్వాంసులు నిర్వాణమంటే యేమి టని తర్కవితర్కాలలోకి దిగి భిన్నరీతులలో సిద్ధాంతాలు చేశారు. నిర్వాణం యే గురుదేవతయొక్క కటాక్షమూ లేకుండగానే శూన్యతానుభవమే అవుతుందా? మహాయాన బౌద్ధంలో నాగార్జునాచార్యులవారి మాధ్యమిక వాద ప్రకారం బౌద్ధులు మాయనూ, పరబ్రహ్మనూ అంగీకరిస్తారు. (శంకరాద్వైతులవలె) హీనయానం క్రమేణా పరివర్తితమై హిందూ వేదాంత మార్గాన్ని అనుసరించింది. దానితో బుద్ధా రాధన బయలుదేరింది. అవతారాలలో బుద్ధుణ్ని చేర్చారు. క్రమంగా బౌద్ధశిల్పం వివిధరీతులలో వికాసం పొందింది.

చైనాలో మహాయాన బౌద్ధ ప్రభావంవల్ల సహజమైన దేశీయ సంస్కృతి మారిపోయింది. బౌద్ధ ప్రభావానికి పూర్వం చైనీయులు వ్యావహారిక సత్యాన్ని మాత్రమే అంగీకరించిన భౌతికవాదులు. మహాయాన సంపర్కంవల్ల వారు భారతీయ దృక్పథమైన ఆముష్మిక చింతనా శీలాన్ని అలవరచుకున్నారు.

బుద్ధభగవానుడు స్టోయిక్కులవలె జాతి, కుల, విచక్షణ లేకుండా జిజ్ఞాసువులయిన ప్రజలందరికీ బోధచేశాడు. నిర్వాణం మానవ జీవిత గమ్యం. అంటే హిందూధర్మంలో పరబ్రహ్మానుభవంవంటిదే యీ నిర్వాణం. టిబెట్‌లోనూ, చైనాలోనూ, లామాలు అయోమయంగా యీతత్వమే ఉపదేశిస్తారు. బుద్ధుడు త్యాగంలో, నిష్కామ కర్మలో మోక్షం వున్నదన్నాడు.

సారనాథ దేవాలయం గురించి యేడవ శతాబ్దంలో చైనా యాత్రికుడు సమగ్రంగా వర్ణించాడు అంతవరకూ విహారశిల్పం ఉజ్వలంగానే వున్నది. కాని పన్నెండవ శతాబ్దిలో ముసల్మానులు దేవాలయ శిల్పాన్ని విధ్వంసం చేసినట్లు నేను తెల్సుకున్నాను.

ఏదో వివాదమున్నప్పటికీ ప్రబల సాక్ష్యం నాకు కనబడుతున్నది. ప్రాచీన శిలా స్తంభమీాద వ్రాసినలిపి యిలా వున్నది.

" దేవానాం ప్రియుడైన అశోకుడు శాసిస్తున్నాడు." రాజశాసనం యిది–" సోదర బిక్షువులకూటంలో చీలికలు కలిగించేవాళ్ళు సంఘంనుంచి బహిష్కృతులవుతారు. వారు కాషాయాంబరం ధరించరాదు." ఈ శాసనానికి దగ్గరగానే మరొక శిలాశాసనంలో 'సహజియాన శాఖవారిది' అని ఉల్లేఖించబడింది. అంతకు పూర్వమున్న బిక్షువులు సంఘ బహిష్కృతులు కాగా వారిస్థానే సహజియాన శాఖవారు వచ్చిచేరారు

భారతీయ నాగరికత గోపూజలోని ఘనతను వివరించినా, నాకు అంగీకారం కాదు. సర్వైక్యత గోపూజలో వుంటే వుండవచ్చు. కాని ప్రత్యేక పదార్థాలకు భారతీయులు విలువనివ్వరు. జీవనానికి విలువ యివ్వడం, గౌరవించడం తప్పదు. అయితే అది చాలా మూల్యాలలో ఒకటి మాత్రమే. బుద్ధుడు గోపూజ చేయలేదు. అయినా ఆయన జీవన సర్వైక్యతను గ్రహించాడు. ఆ సర్వైక్యత హేతుప్రభావమయినదే. అయితే ఐక్యత కేవలం సత్యంకాదు. అది గ్రహించినంత మాత్రాన మోక్షం, శాంతి కలగవు.

బుద్ధునివంటి పరిత్యాగికి విశ్వనాథుడు యెదురుచుక్క. సారనాథంలో 'మూలగంధ కుటీవిహారం' లో మారుని నాట్యకత్తెలు బుద్ధుడిన్ని మోహప్రలోభునిగా చేయాలని

యత్నిస్తూ, నగ్నంగా నృత్యం చేసి చేసి వృద్ధ వనితలవు తారు. వర్ణాశ్రమాచారాలూ, కర్మకలాపాలూ మాయ. అటువంటి మాయా వరణాన్ని ఛేదించిన వాడే బుద్ధుడు. జీవన బంధాలన్నీ త్యజించి వేశాడు.

హీనయాన బౌద్ధాన్ని విమర్శించేవారి పద్ధతి నాకు నచ్చదు. మహాయాన బౌద్ధం జీవన పరమార్థం నిర్వాణమనే శూన్యతత్వమని చెప్పడమూ నాకు నచ్చదు. ఈ నిరాశా వాదం నవీనసత్తా వాదులయిన హైడెగ్గర్, సర్టరులవలె అర్థ రహితం, పరమార్థరహిత నాస్తికవాదమేనని నాకు తోస్తున్నది ఇంకా యీ నాస్తిక సత్తావాదు లంటారుకదా? "సంకుచిత మాయావరణంలో జీవించు. అయితే నూతన కర్మానుష్ఠానం వల్ల మాయావలయం ఛేదించి నీ బుద్ధిని రక్షించుకో" హేతు బద్ధంగా బౌద్ధం వివరించాలి. "మాయను పరిశీలించు. సత్త లేక ఉనికి ఆత్మసారమునూ మాయగా చూడు." యెందుకీ కర్మకలాపం? బౌద్ధులు సనాతన హిందూ ధర్మాన్ని వికలంగా, సులభంగా, స్పష్టంగా చూపించారని నా అను మానం. అంతకన్న 'ధర్మపథం' ప్రమాణంగా స్వీకరిస్తేసరి. "ప్రకృతిధర్మం పుట్టడం, గిట్టడం. విషయాలు క్షణికాలు. పునరావృత్తి రహితత్వమే పరమానందం. బ్రహ్మలోకంకూడా క్షణికం. అది వ్యక్తిగతం. వ్యక్తిగత బ్రహ్మలోకం తృణీక రించు వ్యక్తిత్వంనుంచి విముక్తికై సాధన చెయ్యి."

బుద్ధుడు నేతినేతివాక్యాలతో సుగుణ, నిర్గుణ తత్వాలు ఒకటేననీ, పరిణామం దుఃఖమనీ ఉపదేశించినట్లు కనబడుతుంది. చైనాలో కన్ఫ్యూషియస్ తాత్వికునివలె, ఆధ్యాత్మిక సమస్యల జోలికి ప్రజలు వెళ్లవద్దని, నైతిక జీవనమే ప్రధానమనీ బుద్ధుడు బోధించాడు. "మాలుంక్యపుత్రుడా! నన్ననుసరించి పవిత్ర జీవనం గడుపు. శాశ్వతమనీ, శాశ్వతం కాదీ ప్రపంచమనీ నేను చెప్పుతున్నాను." "కాదు భగవాన్..." అన్నాడు మాలుంక్య పుత్రుడు. "అయితే నేను చెప్పుతున్నాను. జగత్తు శాశ్వతమయినా, అశాశ్వత మయినా జన్మ, జరా, మృత్యు, దుఃఖ, తాప, నైరాశ్యాదు లున్నవి. జన్మ, జరా. మృత్యు, దుఃఖ, తృష్ణా ప్రధ్వంసమే నేను బోధించేది. జగత్తు శాశ్వతమయినా, కాకపోయినా-జగద్విచారణవల్ల ప్రయోజనం లేదు. అది పవిత్ర జీవన సూత్రానికి ప్రాతిపదిక కాదు కూడా."

రెండువేల అయిదువందల సంవత్సరాల క్రిందట గౌతమ బుద్ధుడు ధర్మ ప్రబోధం చేయడానికి సారనాథం వచ్చాడు. సరిగా అక్కడే నేనిపుడు నిలబడ్డాను. విశ్వమానవకోటిలో నాలుగవవంతు ఆయన శిష్య పరంపర. శిష్యకోటి క్రమంగా అవినీతి మార్గాన్ని అనుసరించారు. పెకింగ్‌లో పండితులు నాతో అన్నారు-బుద్ధుడు ప్రజలకు ఆముష్మికచింత కలిగించాడని. ఆయన యదార్థంగా చేసిన ఉపదేశ మేది?

ఈ ప్రశ్నకు సమాధాన మీయడానికి యావజ్జీనసం నేను బౌద్ధ విద్వాంసుడ్ని కానుగాని, కేవలం యాత్రికుడనై బుద్ధ వచనాలను అనుభవ పరంగా గ్రహిస్తాను. శూన్యమని చెప్పే పరతత్వంతో తదాత్మ్యం నాకు అంగీకారం కాదు.

పద్మయోని అయిన పరమేశ్వరుడు శాంతిదాయకుడా? హిందువులు చెపుతున్నది యదార్థమా? జీవితం సర్వ సంగ పరిత్యాగమా? అయితే సృజింపబడేది లేదా? లేకపోతే యెందుకీ జీవన పోరాటం? భిన్న భిన్న చిత్ర వర్ణాశబలిత కోణాలనుంచి జీవనరత్న కాంతులు పరిశీలించడంలో పరమార్థ మేమీ లేదా? బౌద్ధావలంబికుల-మచ్చుకు టిబెట్ బౌద్ధుల అభిమతం యేమిటి? నాకు మార్గదర్శిగావున్న ఘోష్ అన్నాడు-టిబెట్ గిరికందరాలలో బౌద్ధులు తాంత్రికోపాసన చేస్తారట.

నేనిలా పఠించాను-' విముక్తుడికి ' సుందరం ' అంటే యేమిటో స్పష్టంగా తెల్సు. అతని అనుభూతి సుందరమైనది కనక. '

" పవిత్ర జీవనసారం ప్రియమైత్రి, విశ్వమైత్రి. సోదరులారా! సద్వస్తువును చూసి భయపడకూడదు. సద్వస్తువు ఆనంద పర్యాయపదం. అది అత్యంత ప్రీతిదాయకం...నాకై

నిరీక్షించేవాళ్ళు రోగులను కనిపెట్టుకొనండి...తృష్ణామూలంగా, ద్వేషంవల్ల, మాయా భయాలవల్ల మానవుడు పాపాచరణ చేస్తాడు.

"పరివ్రాజకుడు మానవులతో అభిమాన బంధాలు ఏర్పరచుకొనడు. కామాది ప్రలోభాలకు అతీతుడయిన విరాగి యెవరితోనూ వాగ్వాదం చేయడు."

"సోదరులారా! లోకంతో పోట్లాడను. లోకమే నాతో పోట్లాడుతుంది. ధర్మోపదేష్ట లోకులతో వివాదపడడు."

"ద్వేషం ద్వేషంతో సమసిపోదు. ద్వేషరాహిత్యం వల్ల ద్వేషం సమసిపోతుంది. అది ప్రాచీన ధర్మసూత్రం."

"ఆరీతిగా సాధకుడైన సోదరుడు బాహ్యాంభ్యంతరాలలో మననిధి ధ్యాసలు చేస్తాడు. ప్రాపంచిక విషయాలను ఆశించడు."

ఈ సారనాథంలోనే బుద్ధుడు ధర్మచక్రం ప్రవర్తింప చేశాడు. ఆనందంలో ఉద్వేగంలేదనీ, అదేశాంతమనీ, శివంకరమనీ, తృష్ణాక్షయంతో నిర్వాణప్రాప్తి అనీ ఆయన ఉపదేశించాడు. విషయాలకు మానవుడు దూరమై, అనాసక్తుడై సత్కర్మాచరణలో శాంతుడై, దాంతుడై వుండాలి. సాధకుడు అహింసను అలవరచుకోవాలి. "సద్దృష్టి నిస్సంగత్వంమీదనూ రాగ ద్వేష రాహిత్యం మీదనూ, విరక్తి మీదనూ ఆధార

పడింది. ఇది, బుద్ధిపూర్వక స్వకీయ నాశనానికీ, యింద్రియ లాలసకూ మధ్యమార్గం. స్వీయ నాశన విషయంతప్ప మిగతా బౌద్ధసిద్ధాంతం యావత్తూ జైన సిద్ధాంతంవలెనే వున్నది. గాంధీగారి తల్లి జైన మతస్థురాలుగానే వుండేది.

జర్మన్‌కవి సామ్రాట్ 'గేథే' వ్రాసిన 'ఫాస్టు' పద్యనాటకంలో మెఫిస్టోఫిలిఫ్‌తో ఫాస్టు అంటాడు–'సమస్తానికీ మూలం శూన్య' మని. బుద్ధుడు సిద్ధాంతం చేశాడే గాని తోసిరాజనలేడు. ఆయన సర్వసంగ పరిత్యాగానికీ, అనాసక్తికీ ప్రాధానమిస్తూ అష్టాంగమార్గాన్ని ఉపదేశించాడు.

అయితే అన్నిటినీ సరిపెట్టుకునేవాడు. నాతో యిలా అన్నాడు. "ఏమిటీ విరక్తి ? విశ్వమైత్రి, సర్వసంగ పరిత్యాగమూ, అనాసక్తీ అన్నీ సుభాషితాలు. నీ శరీరం అన్యుల శరీరంవంటిది కాదూ ? ఏమిటీ వ్రణంలాంటి జీవన ప్రవృత్తి ? ఫలాభిసంధి రహితమయిన కర్మయోగమేమిటి ? నా కార్యసిద్ధి యేమిటి ? నా మహత్వాకాంక్ష తగ్గించుకుని గొర్రెవలె జీవించారా ? కాషాయాంబర ధారులయిన టిబెట్ సన్యాసులు–'ఓం మణి పద్మేహుం' అని ఉపాసన చేస్తూ వారి మహత్వాకాంక్ష తగ్గించుకొన గలిగారా ? ప్రవృత్తిని విసర్జించారా ?

నేనిలా సమాధాన మిచ్చాను.

"యదార్థభావం కావలసినదే. కర్మాచరణలో యదార్థభావన ప్రబల శక్తిదాయకం."

"హనుమాన్ దేవాలయం ప్రక్కగా కాశీలో నేను వెడుతున్నపుడు తథేకాలోచనలో వున్నాను. దేవాలయం

మీద కోతులు గంతులు వేస్తూ పుష్కరిణివైపు తిరుగు తున్నాయి. నానారూపాలు కనబరుస్తూ కరాళ తాండవం చేసే కాళీమాతకు యెదురుగా యెన్నో కోతులు గంతులు వేస్తున్నాయి.

కోతులకూ, సత్యానికీ సంబంధ మేమిటని మార్గదర్శిని అడిగాను. హిందూధర్మంలో బహు దేవతారాధన వున్నదనీ, హనుమంతుడు దాస్యభక్తికి తార్కాణమనీ చెప్పాడు. వానరాలు ప్రయోజనం కనబడే నిరంతర మానవ ప్రవృత్తిని తెలియచేస్తున్నాయి. "తథాగతుడు సత్యద్రష్టయిన బుద్ధుడు మాత్రం ఆ ప్రవృత్తి చూడలేడు. నామరూప నానా వర్ణి కాళ బలితాభాసలకూ, యీ కోతి గంతులకూ అర్ధమేమిటో ? నాకు అగమ్య గోచరంగా వున్నది."

పై వ్యాసంవల్ల బుద్ధునిపై పాశ్చాత్య ప్రముఖులకు కూడా యెటువంటి గౌరవభావమున్నదో విశదమవుతోంది.

సమాప్తం.



# జీవిత చరిత్రలు

| | |
|---|---|
| బాపూజీ | 1-0 |
| బుద్ధభగవానుడు | 1-0 |
| రామకృష్ణపరమహంస | 1-0 |
| స్వామీవివేకానంద | 1-0 |
| రాజేంద్రప్రసాద్ | 1-0 |
| పండిట్ నెహ్రూ | 1-0 |
| నేతాజీబోస్ | 1-0 |
| రవీంద్రనాద్ టాగూర్ | 1-0 |
| వినాయకసావర్కార్ | 1-4 |
| ఝాన్సీ లక్ష్మీబాయ్ | 1-8 |
| ఆచార్య రంగా | 5-0 |
| రాజా రామ్మోహన్ రాయ్ | 1-0 |
| కందుకూరి వీరేశలింగం | 1-0 |
| విజయలక్ష్మి పండిట్ | 1-0 |
| సరోజనీనాయుడు | 1-0 |
| ప్రజానాయకుడు ప్రకాశం | -12 |
| డాక్టర్ పట్టాభి | 0-8 |
| అల్లూరి సీతారామరాజు | 2-0 |
| మౌలానా ఆజాద్ | 1-8 |
| గాంధీజీ, జీవనవేదం | 8-0 |

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్**

సంస్కృతాంధ్ర బుక్‌డిపో (స్థా. 1882) రాజమండ్రి.

రాజేశ్వరి ప్రెస్. రాజమహేంద్రవరం—*1956*.